# మెహెర్ అవతారం



రచన:

జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు

Penugonda Mallikharjuna rao.
Nuzvid - Bank road.
Pathapet

అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు
మచిలీపట్నం.

2

# MEHER AVATARAM

Compiled by
G. V. G. K. Chandra Mouleswara Rao

First Edition :
28th September 1986.

Copies : 1000

**Price : Rs. 8-00.**

Title Design by :
Dr. G. V. Poornachand,
B.A.,M.S.

Printers :
Sri Venkataramana Printers
Vijayawada—2.

For Copies :
G. V. G. K. Chandra Mouleswara Rao
29—36—12, Museum Road, Vijayawada—2.

**Sole Distributors :**
Sri Kavitha Publications
Vijayawada—520 002.

# ఉపోద్ఘాతము

"మెహెర్ అవతారం" అనే పేరుతో సోదరులు శ్రీ జి.వి.జి.కె. చంద్రఘంటేశ్వరరావు రచించిన బాబా జీవిత చరిత్రకు సంబంధించిన గ్రంథానికి కూడా ఉపోద్ఘాతము వ్రాసే అవకాశము నాకు లభించుట బాబాయిచ్ఛగా భావిస్తున్నాను. మెహెర్‌బాబా నామము నాకు ప్రాణ తుల్యము. నాప్రియతముడు, నాయిష్ట దైవము బాబాయే. అందుకింకా వృత్తేజవరిచే యిటువంటి కార్యక్రమం నాకెంతో రుచికరము. ఆనంద దాయకము.

హృదయంతో చెప్పే నా మాట విశ్వసించండి. ఈ పుస్తకం, మీరు చదివే అవకాశం లభించటం, అసలు చదవాలన్న బుద్ధి పుట్టటం, చదివి బాబా వారి అవతరణను అవగాహన చేసుకోగలగటం, ఇదంతా ఒక నిర్ణీత కార్యక్రమము ప్రకారము జరిగిందే కానీ, అనుకోకుండా ఏదో కథల పుస్తకం చదివినట్లు కాదు. ఒకవేళ అదృష్టిలో చదివితే అవ తార విశిష్టత, బాబా దివ్యత్వం బోధపడదు.

నేడున్న పరిస్థితులు, అట్టహాసములతో నిర్దేశించిన కర్మ కాండలు, పూజాపునస్కారాలు, దేముడ్ని మరుగుపరుస్తున్నాయి. సామాన్య మానవుడిగా జగత్కళ్యాణానికై బాధలన్నిటినీ తనపైనే వేసుకొని, దివ్యప్రేమే జీవితపరమావధిగా పెల్లుబికించి, దివ్యత్వాన్ని జన్మహక్కుగా గుర్తింపచేసి, మానవాళిని తనంత వారిగా చేసేందుకు అవతరించిన భగవంతుని సజీవ చరిత్ర యీగ్రంథం. అవతారుని ప్రభావము దేహము చాలించిన తర్వాత కూడ, మళ్ళీ తాను అవతారము దాల్చి వచ్చేంత వరకు శక్తివంతమై వుంటుంది. ఆయన దర్శన స్పర్శ భాగ్యం పొందిన వారెంతటి అదృష్టవంతులో, ఆయన అవ తార త్యాగానంతరం, ఆయన ప్రేమ పరిధిలోనికి వచ్చిన వారంత కంటె అదృష్ట వంతులు.

ఈ గ్రంథాన్ని మెహెర్‌బాబా జీవితచరిత్ర గా మాత్రమేకాక, ఎట్టి సంకోచము రానీయక, మెహెర్ అవతారముగా చదివి, అనుభూతి పొంది, దివ్య ప్రణాళికలో మీరూ భాగస్తులు కండి. జననమరణ శృంఖలముల నుండి విముక్తిపొంది, గమ్యాన్ని శీఘ్రంగా చేరండి. గనిలోని బంగారము వెలికి తీసేవరకు అదిరాయిగానే వుంటుంది. భ్రాంతిమయ ప్రపంచంలో దివ్యప్రణాళికనుగుర్తించక, శరీరమే తాననుకునే అజ్ఞానుల్ని, తనసత్య ప్రేమలు వెదజల్లి, స్వస్వరూపభావాన్ని వదిలించి, ప్రేమజ్యోతిని వెలిగించి, పరమాత్మగా, అనంత శక్తి, అనంత జ్ఞానము, అనంత ఆనందాలకు మనందరినీ హక్కుదారులుగా గుర్తించేట్లు చేసిన అవతారుడు మెహెర్‌బాబా. ఈ శరీరము దేవుని మందిరము. రాక్షసత్వాన్ని దరిచేరనీయక మనస్సుమీద, హృదయానికి పెత్తనం కల్పించండి.

మనందరం దేముని బిడ్డలం. సోదరభావం అన్యోన్యత లోపించిన మనమధ్య వాటిపునరుద్ధరణకే ఆయన రాక. చిన్ని కళ్లతో యావత్ప్రపంచాన్ని చూడ కలిగినట్లు, యీ చిన్న పుస్తకంలో అనంతము, అవ్యయము, అపరిమితము అయిన శాశ్వతుని భగవదవతరణను చక్కని తేలికభాషలో అందించబడిందంటే బాబాయేస్వయంగా రచయిత రూపంలో అద్దంపట్టారు. శ్రీ చంద్ర మౌళీశ్వరరావుగారు యిప్పటికే వ్రాసిన దాదాపు పదమూడు రచనలు మా మచిలీపట్నం సెంటరుతరపున ప్రచురించే అవకాశం కలగటం ప్రియతముని నిర్ణయముగా తలస్తున్నాను.

జై బాబా

తాడేపల్లి బసవయ్య
అధ్యక్షులు
అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు

# తొలి పలుకు

అవతార్ మెహెర్ బాబా వారి జీవిత చరిత్రని సులభ భాషలో, తేట తెలుగులో సంక్షిప్తంగా తెలుగు పాఠక లోకానికి సో॥ జి. వి జి. కె. చంద్రమౌళీశ్వరరావు గారు అందించారు. ఇప్పటికే ఆయన సంకలనం చేసి, చాలా గ్రంథాల్ని ప్రేమిక బాబా లోకానికందించారు. ధారాళమైన ఆయన రచనా శైలిని గురించి వేరుగా చెప్పనవసరము లేదనుకుంటాను.

చాలామంది భారతీయ, పాశ్చాత్య బాబా ప్రేమికులు ప్రియతముని దివ్య చరిత్రను అనేక భాషల్లో అందించారు. తెలుగులో కూడా చాలా సంపుటాల్లో అందించటం జరిగింది. అయితే సంక్షిప్తరూపంలో బహు క్లుప్తంగా తక్కువ పేజీల్లో, అనంతమైన భగవంతుడు మానవాకృతి ధరించి, అవతారునిగా నెఱపిన అనంతలీలామృతాన్ని తేలిగ్గా అర్థమయ్యేట్లు వివరించుటలో రచయిత సఫలీకృతులయ్యారు. ఆయన కృషికి ప్రియతమ బాబాయే సహాకరించారు. యింకా యిటువంటి మరిన్ని రచనలు సాగించి ప్రియతముని దివ్య ప్రేమ సందేశాలెన్నిటినో అందించే శక్తి సామర్థ్యాలు రచయితకు ప్రసాదించాలని, బాబాను ప్రార్థిస్తున్నాను.

చింతా సర్వారావు
అధ్యక్షులు
అ. మె. ఆంధ్ర సెంటర్.

# ఆశీస్సులు

యుగావతారుడు అవతార్ మెహెర్ బాబా దివ్యచరిత్రను "మెహెర్ అవతారము" అన్న పేరుతో సో॥ జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావుగారు మామూలు వ్యావహారిక భాషలో వ్రాసారు. ప్రియతముని దివ్య చరిత్రని సామాన్య పాఠక లోకం సైతం తేలిగ్గా అవగాహన చేసుకొని ఆయన ప్రేమామృతంలో ఓలలాడేందుకీ పుస్తకం ఎంతగానో వుపయోగ పడగలదని విశ్వసిస్తున్నాను.

యింత సులభశైలిలో ప్రియతముని దివ్య చరిత్రను తక్కువ పేజీల్లో ఎక్కువ విషయాన్ని తెలుసుకోగలిగేట్లు, ఆంధ్ర బాబా ప్రేమికులకందించిన రచయితను అభినందిస్తున్నాను. బాబా సత్యప్రేమ సందేశాల్ని వ్యాప్తిచేసేందుకు, ఆంధ్ర సెంటరు తరుపున మేము చేస్తున్న కృషికీ రచన ఎంతగానో దోహదపడగలదని విశ్వశిస్తూ, వీరు చేసే కృషిలో తన కృపను వర్షింప చేసి మరిన్ని రచనలు చేయగల శక్తి సామర్థ్యాలు ప్రసాదించమని బాబాను ప్రార్థిస్తున్నాను.

Y. మాణిక్యాలరావు
కార్యదర్శి.
అ. మె. ఆంధ్ర సెంటరు.



భగవద్వచనములు రెండవ భాగం గ్రంథావిష్కరణ సందర్భంలో
రచయితను సన్మానిస్తున్న శ్రీ గుడివాడ రామచంద్రరావుగారు
కార్యదర్శి, మచిలీపట్నం సెంటరు.

# నమస్సుమాంజలి

అవతార్ మెహెర్ బాబా వారి జీవిత చరిత్రను సంక్షిప్తంగా వ్రాయమని గత రెండు మూడు అమరతిథి కార్యక్రమాల్లో పాల్గొన్న చాలా సెంటర్ల నిర్వాహకులు నాతో చెప్పటం జరిగింది. వృత్తిరీత్యా, విరామంలేక, కొంత కాలహరణ జరిగింది. ఎంతో కాలంగా మనస్సులో పాదుకున్న జ్ఞాపకాలు, అక్షర రూపంలో వ్యక్త పరిచే అదృష్టం బాబా కృప వల్ల యిప్పటికి కలిగింది దాని ఫలితమే "మెహెర్ అవతారం" అనే యీ నా 13వ కుసుమం.

ఇందులో ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా చాలా పేజీల్లో లెక్కకు మించిన అచ్చుతప్పులు దొర్లాయి. ముఖ్యమైన తప్పులకు చివర్లో ఒప్పులు వేయటం జరిగింది. క్షంతవ్యుడ్ని. అవతార్ మెహెర్ బాబా నూజివీడు సెంటరు స్వంత మందిర ప్రవేశ శుభ సందర్భంలో, ఎప్పటిలా, మచిలీపట్నం సెంటరు వారిచే ప్రచురించబడ, పూజ్యులు శ్రీ తాడేపల్లి బసవయ్య గారిచే యీ పుస్తకం ఆవిష్కరించబడటం నా ప్రియతముని యిచ్ఛగా భావిస్తున్నాను. ఈ రచన వెలుగుకు వచ్చేందుకు ప్రోత్సహించిన సోదరులు, తాడేపల్లి బసవయ్య, గుడివాడ రామచంద్రరావు, చింతా సర్వారావు, మాజేటి సంపత్ బాబా, వై. మాణిక్యాలరావు గార్లకు నా హృదయపూర్వక ధన్యవాదాలు.

విజయవాడ. జి.వి.జి.కె. చంద్ర మౌళీశ్వరరావు.

28-9-86

1

# మెహెర్ అవతారం

"నేను నా తండ్రి ఒక్కటే. నేనే మార్గదర్శకుడను" అన్నాడు ఏసుప్రభువు. "మీ మార్గమంతా ప్రమాదాలతో చుట్టుముట్టబడి వున్నది. కనుక మీరంతా యీ చెట్టు నీడకు చేరండి" అని పిలుపునిచ్చాడు మహమ్మద్ ప్రవక్త. "ఆధ్యాత్మిక చట్టం కనుమరుగైనప్పుడు, భౌతికవాదం ప్రజ్వరిల్లినప్పుడు నేను వస్తాను" అని ప్రకటించాడు శ్రీకృష్ణభగవానుడు. ఇలా రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు, మహమ్మద్ ప్రవక్తలేకాదు, యీ సృష్టి ప్రారంభించింది మొదలు ఇప్పటి వరకు, దైవీ మానవుడు 5,329 సార్లు వివిధ రూపాల్లో మానవులమధ్య మానవుడుగా అవతరించి యీ విశ్వమంటటిపైన, ఆధ్యాత్మికత్వాన్ని వర్షింపజేశాడు.

యిలా అవతరించిన అవతారులు అందించిన బోధలన్నీ యీ కాలచక్రంలో వివిధ వేషభాషల్లో బహిర్గతపరచబడినప్పటికీ వాటి సారం మాత్రం సత్యాన్ని గురించి వివరించటమే. ముఖ్యంగా మానవుడు ఈర్ష్య, ద్వేషము, అసూయ, ప్రలోభాలకు లోబడినప్పుడు, తనలోని సహజవ్యతిరిక్త స్వభావంచేత: తోటి మానవుల్లో స్నేహ భావాన్ని పాదుకొల్పలేక పోతున్నాడు. ఫలితంగా ప్రపంచ వినాశానికే కారకుడవుతున్నాడు. స్వార్థంపెరిగి, అధర్మం మితిమీరినప్పుడు, నిత్య జీవితంలో చింత, ఉద్రేకం, వ్యాకులత

పెచ్చు పెరిగి తగినంత భద్రత కొరవడుతుంది. మానవుడు భ్రాంతిలోపడి మాయలో కొట్టుమిట్టాడుతాడు. నిత్యశంకితుడై జీవిత పోరాటంలో సతమతమవుతూ, భౌతికవాదం ఈ వినాశకర అలలను ఆపగలదని భ్రమిస్తాడు.

యీ విధంగా నైరాశ్యంతో అకాల మృత్యువాతపడే మానవుడ్ని వుద్ధరించేందుకు. భగవంతుడు, దైవమానవునిగా, మానవరూపంలో సంపూర్ణ దైవంగా అవతరిస్తాడు. భగవంతుడు మానవరూపంలో అవతరించిన యుగానికి దైవీమానవుడైన ఆయనే ఆధ్యాత్మిక సర్వాధికారి. ఇతరులకు ఆత్మ సాక్షాత్కారం చేయించగల అనంత శక్తివంతుడు ఆయన ఒక్కడే. సకల సృష్టికి, నూతన శక్తిని, నవచైతన్యాన్ని కలిగించి మేల్కొలుపుట ఆయన కార్యక్రమం. మానవునిలో సరికొత్త అనుభవాన్ని కలిగించగల శక్తి ఆయనకొక్కడికే వుంది. మానవుడు తానెవరో, తానెవరు కాగలడో తెలుసుకొనుటకు, దైవీమానవుడు కొలపాత్రవంటివాడు.

మానవుని మనుగడకు, అభీష్టసిద్ధికి, క్యాబేజీపూలు, రోజా పుష్పాలు రెండూ కూడ, ఏ విధంగా అవసరమవుతున్నాయో, అదే మాదిరిగా, మానవుని జీవితంలో భౌతిక విలువ, ఆధ్యాత్మిక విలువల అనుబంధం అత్యంతావశ్యకమవుతున్నాయి. ఇవి రెండు సత్యమునకు, కుడి ఎడమల వంటివి. భౌతిక ఆధ్యాత్మికతల మేలికలయికతో మేళవించి, అనంతమైన అంతర్గత బాంధవ్యంకలిగిన భౌతిక ప్రపంచంలో మనమున్నాం. ఆర్థిక, సామాజిక, నైతిక, రాజకీయ, శాస్త్రీయ పరమైన దాడులెన్నింటినో చవిచూచింది ప్రపంచం. భౌతిక తిరుగుబాట్లెన్ని ఎదుర్కొన్నా, ఆధ్యాత్మిక తిరుగుబాటు

జరిగితే కానీ, ఆత్మ చైతన్యం ఒనగూడదు. మానవుని చరిత్రలో తదుపరి అధ్యాయం ఆరంభంకాదు! 3|8|94

ఆధ్యాత్మిక తిరుగుబాటు అంటే, మనలోనే అంతర్గతంగా నిద్రాణమై వున్న సత్యాన్ని మేల్కొలుపుట. అన్నమయ, ప్రాణమయ, మనోమయ కోశాల నుండి బయటపడి, విజ్ఞానమయ, ఆనందమయ కోశములవైపు పయనించటమే కాక తిరిగి మానసిక, శారీరక జీవనాల్ని పుత్తేజపరచటం. ఇది దైవం మనకిచ్చే భిక్ష ఆయన కృప వుంటే గాని యిది సిద్ధించదు. దీన్నే దైవప్రేమ అంటారు. దైవం యిచ్చే అపరిమిత ప్రేమ, కరుణల ధారా ప్రవాహమే దైవకృప.

మనకు తల్లిప్రేమ గురించి బాగాతెలుసు. మాతృమూర్తి బిడ్డలను ఎంతో ప్రేమతో అక్కున చేర్చుకుని లాలిస్తుంది. పిల్లకోతి తల్లినంటిపెట్టుకొంటుంది. పిల్లికూనను తల్లి నోట కరచి సాకుతుంది. ఏమైనా తల్లి తల్లే. అలాగే దైవ కృప యీ తల్లిప్రేమ కంటె కూడ మించిన ఎంతో వుత్కృష్టమైన అత్యున్నతపరం. ఆయన తన ప్రేమను మానవాళి కందించేందుకు, మానవ విలువలను దైవికమైన మానవ జీవితంతో అన్వయించి,తానాచరిస్తూ, మార్గదర్శకుడై ప్రబోధించేందుకు దైవీ మానవుడుగా భగవంతుడు అవతరిస్తాడు.

గంగా, గోదావరి, కృష్ణ అనే పేర్లు కలిగి విడివిడిగా ప్రవహించే మహానదులు, అనంత మహాసాగరంలో కలిసిన తరువాత, అవన్నీ తమ తమ నామ రూపాల్ని విడిచి సముద్రంలో ఐక్యమై, వేరుగా కనబడక, మహా సముద్రమే అయి ఎలా వున్నవో అదే మాదిరి, అజ్ఞానంతో నేనే ఆత్మను అనుకునే జీవుల్ని వుద్ధరించి, జ్ఞానవంతుల్నిచేసి ఆత్మ ప్రభో

దంతో మేల్కొల్పి పరాత్పరుడైన దివ్య పురుషుని యందు ఐక్యమై తానేపరబ్రహ్మమన్న సత్యాన్ని తెలుసుకోగలిగేట్లు చేసేందుకే అవతారుని రాకకు కారణం.

మనలక్ష్యం శరీరంకాదు. ఇంద్రియాలుకాదు. మనస్సుకాదు. సంసారమనే వ్యాధి అంతకంటేకాదు. అహంకారం బుద్ధి వీటన్నిటికంటే విలక్షణమైన సర్వసాక్షియగు పరమాత్మే మనలక్ష్యం. అందుకే యీ దేహేంద్రియాది అనాత్మ జాతమునంతటిని, నేతి నేతి అని శాస్త్రం నిషేధించింది. వున్నది భగవంతుడు ఒక్కడే. తక్కినదంతా మిథ్య. మనకంటికి కనపడే జగత్తంతా నిజంగా వున్నట్లే కనబడుతూన్నా అదివట్టి భ్రమ. యీ ప్రపంచమంతా తాడుని చూచి పామని భ్రమించినట్లు కేవలం కల్పితమే. దేహాది జ్ఞానులైన అవివేకుల్ని మేల్కొలిపి వివేకవంతుల్ని చేసి సంసార లంపటం నుండి బయటపడే అనుభవాన్ని కలిగించటం అవతారుని కార్యక్రమం.

సముద్రాన్ని దాటాలనుకున్న వారు ఒడ్డుకు చేరే అలల్ని ఆశ్రయిస్తే ఆవలి ఒడ్డుకు చేరలేదు. సముద్రాన్ని తరించాలంటే మంచి సాధనాన్ని ఎంచుకోవాలి. అలాగే దుఃఖ మయమైన ఈసంసారమనే సముద్రాన్ని దాటాలంటే కుహనా గురువుల్ని కాక సత్పురుష సాహచర్యమే ఆత్మజ్ఞానాన్నందించే ఓడవంటిదవుతుంది. దుర్లభమైన యిటివంటి సాహచర్యం పొందే అదృష్టం ఏ కొద్దిమందికో లభిస్తుంది. ప్రేమకు ప్రతిరూపం భగవంతుడు. ఆయనఅనంతుడు.అందరిలోను అన్నిటియందు వుండి, శ్రేష్ఠతమము, సర్వ వ్యాపకమైన వ్యక్తిగా ఈ సకల సృష్టిలోని చరాచరములు తానే

అన్న జ్ఞానాన్ని మానవులలో కలిగించటమే అవతార కార్య ప్రణాళికలోని ముఖ్యభాగం.

ఈ విషయాన్నే శ్రీకృష్ణుడు గీతలో చెబుతాడు. "నా దివ్యమైన నిరాకార రూపంలో నన్ను పరబ్రహ్మ అంటారు. హృదయ స్పందన కలిగిన రూపంలో నన్ను జీవుడు అంటారు. అంతరంగంలో నన్ను చూచేందుకు వుత్కంఠతో వుండే నా అంతర్గత ఉనికిని ఈశ్వరుడంటారు. అనేక దేముళ్ళ రూపంలో మనస్సును భావాల్ని అదుపులో వుంచేప్పుడు నన్ను చిత్తమంటారు. నా భౌతిక రూపంలో నన్ను శరీరమంటారు. అవతరించి, యీ ప్రపంచాన్ని సృష్టించే నా రూపాన్ని పరాశక్తి అంటారు. అంతర్యామిగా నేను శ్రీ మహావిష్ణువును. అవ్యక్తుడుగా నేను శివుడను. సృష్టి కారకుడుగా నేనే చతుర్ముఖుడైన బ్రహ్మను" అంటాను.

కేవలం పేర్లనే వలలో చిక్కి, సారాన్ని పదిలపరచు కొనటంలో విఫలురై, శాస్త్రులు చెప్పే భౌతిక రూపాల్నే ఆరాధించే మానవాళికి తరుణోపాయం కలిగించేందుకు, యినుపయుగమైన యీ కలియుగంలో, యీ అణుయుగంలో, శాస్త్రీయ జ్ఞానాన్ని అపారంగా సముపార్జించి, విర్రవీగే మానవ మేధస్సు, సునాయాసంగా ఆధ్యాత్మిక రహస్యాన్ని గ్రహించకలిగేట్లు చేసేందుకు మరల భగవంతుడు మానవరూప ధారియై మన మధ్యకు మరొక్కసారి వచ్చాడు. ఆయనే "అవతార్ మెహెర్ బాబా." ఆయన జీవితంలో అధికభాగం మౌనం, ఏకాంత వాసానికే ప్రాధాన్యత నిచ్చారు. "అను మానించకండి! నేనే ఆసనాతనుడ్ని. అవతార పురుషుడను.

7/8/92

దైవీ మానవుడ్ని, నేను మీరు చూస్తున్న యీ శరీరాన్ని కాదు. అది నేను మిమ్ములను చూడవచ్చేందుకు వేసుకు వచ్చిన ఒక దుస్తు మాత్రమే. నేను అనంత చైతన్య శక్తిని. నేను మీతో కూర్చుంటాను. నవ్వుతాను. మీతో ఆడుకుంటాను. అయినా అదే సమయంలో ఉనికియందున్న అన్ని భూమికలలోను నేను పని చేస్తాను" అని ప్రభోదించారు.

ఏ మతానికయినా భగవదవతరణ జరిగి నప్పుడు, ఆ మతంవారికి ఒక నమ్మకం పాదుకుంటుంది. క్రీస్తుగా వచ్చిన ప్పుడు క్రీస్తు మతానికి, మహమ్మదుగా వచ్చినప్పుడు మహమ్మదీయ మతానికి, అలాగే రాముడుగా కృష్ణుడుగా వచ్చి నప్పుడు హిందువులకు వారంతా, ఆయా నామాలపైన నమ్మకంతో పెంచబడ్డారు. అయితే మెహెరావతారం, సర్వ మత సమన్వయమై, సోదరభావం, సమానత్వం అన్న ప్రాతి పదికపై, కులమత వివక్షత లేని విధంగా దైవ ప్రేమకు ప్రపంచ మానవులంతా సమానమే నన్న అనుభూతిని కలిగించిన అవతారం.

"సర్వోన్నతుడైన జగద్రక్షకుడు తన వారి మధ్యకు వస్తాడు. వారుమాత్రం ఆయన్ని అంగీకరించరు" ఇది బైబిలు చెప్పే ప్రవచనం. అప్పుడేకాదు, యుగయుగాలుగా భగవదవతరణ జరిగిన ప్రతిసారి, యిలా జరుగుతూనే వుంది. అన్ని పేర్లకు, రూపాలకు అతీతుడైనవాడు, మానవ శరీరంతో జనన మందాడన్నప్పుడు సంశయం రాక మానదు.

రాముడ్ని, ఆనాటి మానవులు దైవంగా గుర్తించేందుకు వ్యతిరేకించారు. రావణుడుసైతం ఆయన అవతార తత్త్వాన్ని తిరస్కరించి పతనమైనాడు. అలాగే కృష్ణావతా

రంలో కౌరవాది వీరులంతా విరోధులై సర్వ నాశనమైనారు. ప్రతి యుగంలోనూ అవతారునితో సన్నిహితంగా సంచరించే మహాభాగ్యం ఏ కొద్దిమంది అదృష్టవంతులకో దక్కుతుంది. తక్కినవారు, కుశంకలతో, కనీసం, అర్థం చేసుకోవటానికి కూడ ప్రయత్నించరు.

ఇటువంటిదే ఇప్పుడుకూడ జరిగింది. 1894 ఫిబ్రవరి 25వ తేదీన, భారతావనిలోని పూనా పట్టణంనడి బొడ్డున ఒక పారశీ కుటుంబంలో, షెరియార్జీ, శిరీన్‌మాయిలను పుణ్య దంపతులకు, ముద్దు బిడ్డగా, మేర్వాన్ అన్న పేరుతో పుట్టిన ముద్దుబిడ్డే అవతార్ మెహెర్ బాబా. భగవంతుడు అవతరించినప్పుడు, దుష్ట సంహారం చేసి, శిష్ట రక్షణ జరిపి, ధర్మాన్ని ప్రతిష్ఠించటం జరుగుతుందని కదా! గీతలో చెప్పింది?

నిజానికిటువంటి కార్యభారాన్ని, భగవంతుడు జననము తీసుకోకండానే చేయగలడు. అలా చేస్తే మానవాళి, ఆయన నిర్గుణత్వాన్ని గ్రహించి, అర్థం చేసుకోలేరు గనుక, ఆయన యీ భూతలముపై మానవుల మధ్య మానవుడుగా జన్మించి, తన నిర్గుణత్వాన్ని మనం గ్రహించకలిగే అవకాశాన్ని కల్పించి, మనమాయన్ని ఆరాధించేందు కనువుగా అవతరించాడు. అసలలా అవతరించకుండా వుంటే, అప్పుడు మనమాయన లేడనే అంటాం. ఒకవేళ దిగివచ్చి, మానవుడుగా మనల్నుద్ధరించే కార్యక్రమం చేపడితే, దయగల తండ్రిగా ఆయన చేసే పనుల్ని, సరిగా అర్థం చేసుకోలేక, విమర్శించటం జరుగుతుంది.

ఎన్ని విమర్శలొచ్చినా, అవతారుడు తన లీలల్ని కొనసాగించి మనలో ఆంతరంగిక మేలుకొలుపు కలిగిస్తాడు. జగ

12/8/91

ప్రసిద్ధమైన మానవుని, అంతరంగిక శత్రువులైన కామం, క్రోధం, లోభం, మోహం, మదం మాత్సర్యాలనే అరిషడ్వర్గాలు శరీరంపై పెత్తనం చెలాయించకుండా వాటిని అదుపు చేయగల శక్తిని మనలో మేల్కొలుపుటకాయన మెహెరావతారుడుగా అవతరించాడు.

ఈ ఆధునిక యుగంలో, శాస్త్ర విజ్ఞానం బాగా అభివృద్ధిచెందటంతోపాటు, మానవమేధస్సుకూడ బాగా అభివృద్ధి చెందిన ందున, యీ నాటి మానవాళిని జనన మరణ బంధాల్నుండి విముక్తుల్ని చేయుటకు నవీనులందరిలోనూ నవీనుడుగా, లింగబేధంలేని ఆదర్శవంతమైన, సర్వమత సామరస్యాన్ని పెంపొందించేందుకు దిగివచ్చిన భగవంతుడే మెహెరవతారం. మెహెర్ బాబా జీవితం అద్భుతాలతో ప్రారంభమై అంత్యంలో, మెహెరాజాద్‌లో 1969 జనవరి 31వ తేదీన తన పాంచ భౌతిక శరీరపరిత్యాగం జరిగేంతవరకు మహనీయంగా కొనసాగింది.

ఆయన జననానికి కొన్ని గంటల ముందు, తల్లి శిరీన్, పెద్ద ప్రజా సందోహం తనవైపు బారులుతీరి, తరలి వస్తున్నట్లు కలగన్నది. చంటి బిడ్డగా వున్నప్పుడు, పెద్ద కోడె త్రాచు, బాలుని చుట్టి పడగ విప్పి, ఆయన తలపై నాట్యం చేసింది. తండ్రి చిన్న తనంలోనే దైవ చింతనతో సత్యాన్వేషకుడుగా సంచార జీవితం గడిపే సమయంలో అశరీరవాణి ద్వారా తాను కోరుకునేది తన గర్భవాసాన్నే లభ్యపడుతుందని కలగంటాడు. యివన్నీ ఆయన సామాన్య మానవునిలా గర్భనరకం అనుభవించలేదని సూచిస్తాయి.

అన్ని జాతులు, కులాలు, మతాల వారెందరో లెక్కకు

మించిన శిష్యుల్ని దరిజేర్చి, మానశిక శిక్షణద్వారా, వారికి నిస్వార్ధ సేవయొక్క కఠోర జీవితం గడపటంలో తర్ఫీదు నిచ్చిన అవతారమే మెహెరవతారం. భగవంతుని ప్రేమించడం, ఆధ్యాత్మిక చింతన కలిగించటం వంటివి ఆయన యిచ్చిన శిక్షణలో ప్రధానమైనవి.

"నీవు నేను కలిసి మనం కాదు. ఒక్కరే అవుతున్నాం. నేను ప్రియతముడైన భగవంతుడ్ని. మిమ్మల్ని మీరు ప్రేమించుకోలేనంతగా, నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను." అని అభయమిస్తూ, "వ్యధ చెందకండి. సంతోషంగా వుండండి. హృదయపూర్వకంగా భగవంతుని ప్రేమించండి." అని చెప్పటమే కాక, వాటిని తాను ఆచరించి, చూపి, ఇతరుల్ని వుత్సాహ పరచి, వారిలో నిస్వార్ధ సేవ పాదుకోనేట్లు చేశారు.

ఆయన ప్రేమ పూరిత దయాగుణం, నమ్మకంతో సంబంధం లేకుండానే మోహితులై, ఆయనవైపు ఆకర్షితులైనవారెందరో మరి! "నన్ను చూడకలగండి. నాకు విధేయులుకండి . నన్ను ప్రేమించండి." అన్న ఆసనాతనుడు, అద్భుతాల తర్వాత అద్భుతాలెన్నో చేస్తూనే, నేను మహత్తులేవీ చేయనని చెపుతూ, తన భక్తుల భావాలలోని దుష్ట తలంపులను సమూలంగా నిర్మూలించి, ఆంతరంగిక మేల్కొలుపు కలిగించి ప్రేమ బీజాన్ని నాటారు. అహంకారమనే సంకెళ్ళు తొలగించి భవబంధాల్నుండి విముక్తుల్ని చేసి, ప్రేమ మార్గం చూపి, మనల్ని వెన్నంటి నడిపిన, మెహెరవతారం గురించి తెలుసుకుందాం.

2)

మెహెర్‌బాబా అసలు పేరు మేర్వాన్ షెరియార్జి యిరానీ. యిండియాలోని పూనా మహానగరంలో 1894 ఫిబ్రవరి 25వ తేదీన ఉదయం అయిదు గంటలకు ససూన్ ఆసుపత్రిలో జన్మించారు. మేర్వాన్ తలిదండ్రుల పేర్లు, వారి యింటి పేరులను బట్టి వీరు పర్షియనులని తెలుసుకో వచ్చు. ఆయన తండ్రి షెరియార్జి ముండేగర్ ఇరానీ. పర్షియా దేశంలోని ఖుర్రంషాహి అనే వూళ్ళో, 1858వ సంవత్సరంలో పుట్టాడాయన. ఈయన తండ్రి అంటే మేర్వాన్ తాతగారు తమ వూళ్ళోనే వున్న జోరాష్ట్రియన్ మతస్తుల శాంతి స్థూపానికి కావలివానిగా పని చేసేవాడు.

వారిది చాలా పేద కుటుంబం. షెరియార్జికి అయిదేళ్ళ వయస్సున్నప్పుడు, తల్లి మరణించింది. తల్లిలేని పిల్లవాడు, తండ్రితోపాటే ఆ శాంతిస్థూపందగ్గర గడిపేవాడు. శాంతి స్థూపమంటే, మరణించినవారి శరీరాల్ని యీ స్థూపంపై వుంచి, కాకులు గద్దలు మొదలగు పక్షులు తినేందుకు వీలు కల్పిస్తారు. బ్రతికున్న వారికి, ఏ రకమైన అపకారం జరగకుండా పక్షులకు ఆహారంగా, మరణించిన వ్యక్తుల శరీరం వుపయోగపడేట్లు చేయటం జోరాష్ట్రియన్ మతస్తుల ఆచారం. యిటువంటి శాంతి స్థూపాల్ని "దక్మా" లంటారు.

షెరియార్జికి పదమూడేళ్ళ వయస్సు వచ్చినప్పుడు, తండ్రిని వదిలేసి, మునిగా మారిపోయాడు. ఆయన కప్పుడు చదవటం వ్రాయటం రాదు. అసలు బడికంటూ వెళ్ళలేదు. దైవచింతన పెల్లుబికింది. సత్యాన్వేషణకై ధ్యానసమాధిలో త్యాగమయ జీవితం గడపాలని నిశ్చయించుకొని, కాషా

యాంబరాలు ధరించి, దాదాపు ఎనిమిదేళ్ళపాటు సన్యాసిగా పర్షియా దేశమంతా తిరిగాడు. చివరికి అలా ఎంత తిరిగినా తానాశించిన ఫలితం లభించదని తెలుసుకున్నాడు. తన అన్నతో కలిసి, భారతదేశానికి బయలుదేరి బొంబాయి చేరాడు. భుక్తికోసం యిద్దరూ వుద్యోగం సంపాదించారు.

అయిదు నెలలు గడిచాయో లేదో, షెరియార్జీకి మళ్ళీ జీవితంమీద విరక్తి పుట్టుకొచ్చింది. తన పని మానేశాడు. ఆ నెల, తనకు రావలసిన జీతంక్రింద కేవలం రెండు రూపాయలుమాత్రం పుచ్చుకొని, తక్కినదంతా వదిలేసి, మళ్ళీ సన్యాసి జీవితాన్ని ప్రారంభించాడు. దండ కమండలాలతో భారతావనంతా పదేళ్ళపాటు ఎన్ని కష్టాలెదురయినా ఓర్చుకొని తిరిగాడు. రెండవమారు ఆచరించిన, ఈ సన్యాసి జీవితంకూడ మొదటిసారిలాగానే, ఏఫలితాన్నీ ఇవ్వలేదు. కోరుకున్న ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని సాధించలేకపోయాడు. నిరాశతో మళ్ళీ బొంబాయి చేరి అక్క ఫిరోజా యింట్లో వుండిపోయాడు.

ఒక రోజున షెరియార్జీకి ఓ వింతకల వస్తుంది. తాను కోరుతున్న గమ్యం తానుగా పొందే అవకాశం రాసిపెట్టిలేదని, అయితే తన గర్భవాసాన జన్మించే కొడుకుద్వారా దొరుకుతుందని కల కంటాడు. విరాగిగా తిరుగుతున్న తమ్ముడు యింటికి చేరాడన్న సంతోషంలో అక్క ఫిరోజా అతడకి పెళ్ళి చేస్తే యిల్లు వదిలి పోడని తలచి, ఓ యింటివాడ్ని చేయాలనుకుంటుంది. పెళ్ళి చేసుకోమని తమ్ముడ్ని వత్తిడి చేస్తుంది. పెళ్ళంటే యిష్టంలేని షెరియార్జీ తన అయిష్టతను వెలిబుచ్చుతాడు, అయినా అక్క వత్తిడి ఎక్కువ

కావటంతో, వారింటి సమీపంలోనే వుంటున్న దోరాబ్జీకోరం షాహి అనే ఒక పర్షియా వర్తకుని కుమార్తెను ప్రేమించినట్లు నటిస్తాడు.

అప్పుడాపిల్ల వయస్సు యింకా ఆరేళ్ళన్నా నిండలేదు. షెరియార్జీ వయస్సప్పుడు ముప్పై దాటింది. అందుకని, ఆ పిల్లతండ్రి ఆ అమ్మాయిని తనకెలాగూ యిచ్చి పెళ్ళి చేయడని అతని వూహ. అక్కగారి పోరు పడలేక, చేసుకుంటే ఆ పిల్లనే పెళ్ళి చేసుకుంటాగాని, యింకెవ్వరినీ పెళ్ళి చేసుకోనంటాడు. దైవనిర్ణయం తప్పించటం ఎవరితరం? ఎలాగయితేనేం? అక్క ఫిరోజా ఆ పిల్ల తలిదండ్రుల్ని ఒప్పించేందుకు ప్రయత్నించింది. చివరికు పిల్ల తలిదండ్రలు, షెరియార్జీని అతి పవిత్రమైన వ్యక్తిగా గుర్తించి, వయస్సులో తేడా వున్నా లెక్క చేయక, తమ కుమార్తెనిచ్చి పెళ్ళి చేసేందుకు అంగీకరించారు. ఆ పిల్లకు 14 ఏళ్ళు వచ్చాక పెళ్ళి చేయాలని ఫిరోజా వారిని ఒప్పించి విజయం సాధించింది. ఆ పిల్లపేరు షిరీన్‌భాను. ఎనిమిదేళ్ళ తర్వాత అంటే ఆ అమ్మాయికి 14 సంవత్సరాలు నిండాక, 1892లో షెరియార్జీతో వివాహం జరిగింది.

పెళ్ళి కాగానే, కుటుంబ పోషణకై షెరియార్జీ సంపాదనపై దృష్టి సారించాడు. పూట గడిచేందుకు మొదట్లో తోటమాలిగా పని చేశాడు. ఆ తర్వాత ఒక పెద్ద ఎస్టేటుకు కాపలాదారుడిగా కుదిరాడు. కొన్నాళ్ళలా గడిచిం తర్వాత, స్వంతంగా టీ దుకాణం తెరిచాడు, చదవటం, వ్రాయటం మెల్లిగా నేర్చుకున్నాడు. స్వయంకృషితో, పర్షియన్ భాషతో పాటు, అరబిక్, గుజరాతీ, మరాఠీ

భాషల్ని కూడ చదవటం వ్రాయటం నేర్చుకున్నాడు. ఎంతో శ్రావ్యంగా పాడేవాడు. మంచి కవిగా తయార య్యాడు. జోరాష్ట్రియనులు పాడుకునే భజనగీతాలెన్నో వ్రాశాడు. ఆయన భార్య షిరీన్‌భాను ఎంత అందంగా వుంటుందో, అంత తెలివైంది. ఆమెకు కూడా నాలుగు భాషలు క్షుణ్ణంగా వచ్చు. వారి దాంపత్య జీవితం ఆనందంగా గడిచిపోయింది.

అలా కొన్నాళ్ళు గడిచాక బొంబాయి వదిలి, పూనా నగరానికి మకాం మార్చారు. అది ఒకప్పటి మహారాష్ట్ర రాజధానీ నగరం. విద్యావ్యాసంగాలకి, సాహిత్యానికి కాణాచి. అన్ని రంగాల్లోనూ ప్రముఖపాత్ర వహించే ప్రదాన నగరం. పూనా, "ముత్తా - నూలా" అనే రెండు నదుల మధ్య నిర్మించబడింది. పూనా పాత నగరంలో మెరియార్జి తన భార్యతో కాపురం పెట్టాడు. అక్కడే 1893 లో వారి ప్రథమ సంతానం కలిగింది. అతడి పేరు జంషెడ్జీ. ఇతడు 1926 లో మరణించాడు. రెండవ సంతానమే మేర్వాన్. తర్వాత జాల్, బెహ్రాం, అర్దేశిర్ అనే ముగ్గురు మగ పిల్లలు, ఫ్రీని, మణీ అనే యిద్దరు ఆడపిల్లలు పుట్టారు. మణీ 1918లో పుట్టింది. ఫ్రీని ఆరేళ్ళ వయస్సులో మరణిం చింది.

1894లో ఫిబ్రవరి 25 వుదయం అయిదు గంటలకు మేర్వాన్ జన్మించాడు. జోతిష్కులు యితడొక సద్గురువు అవుతాడని జాతకం చెప్పారు ఆయన గమ్యం సద్గురువు స్థాయట. ఆయనదొక సాధారణ జననమే అయినా ఆయన జన్మతో ముడిపడిన అద్భుతాలు కొన్ని గమనించదగినవి.

తల్లిదండ్రులు పెట్టినపేరు మేర్వాన్ షెరియార్జీ అయినా, ఆ పేరు త్వరలోనే మెహెర్‌గా మారిపోయింది. డేవిడ్ ససూన్ హాస్పిటలులో ప్రసవించిన తర్వాత మెర్వాన్‌ని తల్లి షిరీన్‌భాను బట్లర్ మొహల్లా నం. 816 ఇంటికి తీసుకు వచ్చింది. యీ ఇంటినే 1940లో కంటోన్మెంటు బోర్డు వారు మెహెర్ మొహల్లాగా మార్చారు. అది ఓ చిన్న యిల్లు. దాన్ని బాబా తండ్రి షెరియార్జీకొని రిపేరు చేయించారు. 30 అడుగులు బారు 20 అడుగులు వెడల్పు వుండి అందులో రెండు గదులుండేవి. వంటగది, స్నానాల గది, విడిగా ఉండేవి. మేడపై మరో గది వుండేవి. యీ ఇంట్లోనే బాబా చిన్నతనమంతా గడిచి పోయింది. దీన్ని కొనకముందు, రెండేళ్ళపాటు, భగవాన్‌దాస్ చావల్ అనే యింట్లో అద్దెకువుండేవారు. మణిజా యిరానీ పుట్టగానే బట్లర్ మొహల్లాకొని అందులోకి మారారు. జాల్, బెహ్రాం తాలూకు కుటుంబాలవారు యిప్పటికీ దీనిలోనేవుంటున్నారు.

మెహెర్ యొక్క బాల్యం సుఖంగానే గడిచిపోయింది. ఆరోజుల్లో ఆయన్నెరిగినవాళ్ళు, ఆయన చాలా చురుకైన వాడని, చిలిపిగానున్నా మంచి చురుకైన వాడనీ, సౌమ్యుడని నిస్వార్థ పరుడని చెప్పిన సందర్భాలున్నాయి. ఆయనకు రెండేళ్ళు వచ్చాక, ఒక రోజు సాయంకాలం తప్పటడుగులేస్తూ ఇంటిముందు అడుకుంటూ, మెల్లిగా నడిరోడ్డు మీదకు వెళ్ళాడు. సరిగ్గా అదేసమయంలో, పాడి పశువులు పచ్చిక మేసి ఇళ్ళకు చేరుకుంటున్నాయి. మేర్వాన్ ఆ గేదెలమంద మధ్యలో చిక్కుకు పోయాడు. యింటి పనిలో కూరుకు పోయిన తల్లి మేడపైనుంచి, యీ ప్రమాదదృశ్యాన్ని

చూచి గాభరాపడిపోయి, కొడుకుని రక్షించుకోవాలన్న ఆదుర్దాతో పరుగున రోడ్డుమీదకు చేరింది. అప్పుడామెచూచిన దృశ్య మెటువంటిదో చూడండి! పెద్దకొమ్ములున్న గేదె ఒకటి తనముందు కాళ్ళను బాలుని ముందు వైపున వెనుక కాళ్ళను వెనకవైపున వుంచి, బాలుడు సరిగ్గా తన మధ్యగా వుండేటట్లు నిలబడి, తక్కిన మందంతా దాటి పోయేంత వరకూ అలాగే నిలబడి వుండి పోయింది. మందంతా దాటి పోయింతర్వాత బాలునికేవిధమైనహాని, వత్తిడి తగలకండా చల్లగా తప్పుకుని తన దారిని తాను వెళ్ళిపోయింది. ఆ దృశ్యాన్ని కళ్ళార చూచిన షిరీన్‌భాను ఆనందంతో పరవశమై కుమారుని అక్కున చేర్చుకొని ముద్దిడివెయ్యిదేముళ్ళకి మొక్కిందేకాని, తనబిడ్డే సాక్షాత్తు పరమాత్మ అని ఎరుగలేక పోయింది.

ఒకనాడు తమ దొడ్డిలోని భావినుండి, దేవకన్య ఒకరు పైకిలేచి వచ్చి షిరీన్ చేతులలో వున్న బాలుడ్ని తనకు యిమ్మని లాగినట్లుగా కలగంటుంది. స్వప్న వృత్తాంతాన్ని భర్తకు చెప్పగా, తమ బిడ్డడు సకలజగత్తుకు కాంతి విరజిమ్మె కారణ జన్ముడని చెపుతాడు. షిరీన్‌మాయి కిటువంటి వాటి పైన నమ్మకం లేకున్నా తన బిడ్డయావత్ప్రపంచంలోకెల్లా మహిమాన్వితుడు కావాలని ఆకాంక్షించింది. తమ జాతిలో అందరి మన్ననలు పొందాలని తలపోసింది. నూతిపై భాగాన్ని ఇనుప చక్రంతో మూయించివేసింది.అయినప్పటికీ బాల్యావస్థలో మేర్వాన్ ఎన్నో అద్భుతాలు చేశాడు. యశోదలా షిరీన్‌కూడ, మేర్వాన్ బాల్య క్రీడలెన్నోరుచి చూసింది.

చిన్నతనంలోనే తండ్రి, హాఫీజ్ తదితర కవుల గీతాలెన్నో నేర్చాడు. ఆటపాటల్లో ఎక్కువ వుత్సాహం చూపేవాడు. ముందుగా పాదంజీ గుజరాతీ కిండర్ గార్డెన్ స్కూల్లో చేర్చారు. అయిదేళ్ళు వచ్చాక, దస్తూర్, బాలికల పాఠశాలలో చేరాడు. లెక్కల మూల సూత్రాలు నేర్చుకున్నాడు. గుజరాతీ భాష. చదువుట వ్రాయుట నేర్చుకున్నాడు. 9 ఏళ్ళ లోపు వచ్చాక క్యాంపు గవర్నమెంటు స్కూల్లో చేర్చారు. మేర్వాన్‌పై తల్లికి అవ్యాజానురాగములెన్ని వున్నా అల్లరి పనులు చేసినప్పుడు. మధ్య మధ్య మందలించేది. చేయిచేసుకోవటం జరిగినప్పుడు, భర్త కల్పించుకొని, "యీవేళ నీవెవరిని కొట్టావో తెలుసుకోగలిగినప్పుడు, ఎంతగా విచారిస్తావో తెలుసుకోలేకపోతున్నావు" అని మందలించేవాడు. ✓ 8/9/96

బాల్యంనుండి మేర్వాన్ ఆటపాటలందు చలాకీగా వుండేవాడు. భారతీయ ఆటలంటే మహా యిష్టం. ఆత్యా పాత్యా, గిల్లీదండా (కర్రా-బిళ్ళా) బాస్కెట్ బాల్, ఫుట్ బాల్, ఏడుపెంకులాట, క్రికెట్, పేకాట, మొదలగు ఎన్నో ఆటల్ని మక్కువతో ఆడేవాడు. క్రికేట్ హాకీల్లో మేటి. ఆయనకు యిష్టమైన దర్శనీయస్థళాలు, మహమ్మదీయుల గోరీలదొడ్లు, పార్శీల శాంతిస్థూపాలు. గంటలతరబడి, వాటిల్లో ఏకాంతంగా కూర్చునేవాడు. సంగీతమంటే ఆనందించేవాడు. స్కూల్లో క్రమశిక్షణ పాటించేవాడు. నియమోల్లంఘన చేసే వాడు కాదు. వేగంగా నడవడంలో, బాగా పరుగెత్తడంలో దిట్ట. జట్టులకెప్పుడూ తానే నాయకత్వం వహించేవాడు.

మేర్వాన్ ప్రాథమిక విద్య పూర్తికాగానే, సెయింటు విన్సెంటు హైస్కూలులో చేరాడు. పూనాలోకెల్ల పేరున్న పాఠశాలయిది. 1911లో యీస్కూల్లోనే ఆయన మెట్రికుల్యేషను పరీక్షపాసైనాడు. అప్పుడాయన వయస్సు17ఏళ్ళు. హైస్కూలు చదువులు చదివే రోజుల్లో తోటివిద్యార్థులతో మాత్రమే కాక ఉపాధ్యాయులందరిచేత ప్రశంసించబడేవాడు. షేక్స్పియరు,వర్డ్స్వర్తు, హాఫీజులాంటి మహాకవులసాహిత్య గ్రంథాలెన్నో చదివాడు. భారతీయ పద్ధతుల్లోఎన్నో గీతాల్ని వ్రాశాడు. పర్షియన్, ఇంగ్లీషు భాషలోకూడ రచనలు చేసేవాడు. వాటిల్లో చాలా గీతాలు పెక్కు వార్తా పత్రికల్లో మాస పత్రికల్లోనూ ప్రకటించబడ్డాయి. "హామా" అనే కలంపేరుతో ఎన్నో కవితలు, పద్యాలు, పాటలు వ్రాశాడు. పద్యరచనంటే ఆయనకు అభిరుచి. తన 15వ ఏట ఆయన వ్రాసిన కథ ఒకటి జాతీయ పత్రికలన్నిటిలో ప్రకటించబడింది.

ఇంగ్లీషుతోపాటు, నాలుగు యితర భాషల్ని ఆయన వ్రాయటం, చదవటమే కాక, అనర్గళంగా మాట్లాడేవారు. చిన్నతనంలో ఆయన ప్రముఖ వాగ్గేయకారులరచనలు చదవటంవల్ల, ఆయన వుపయోగించే ఇంగ్లీషు ఎంతో హుందాగా వుండేది. బాగా చదువుకున్న వారి పాండిత్యంలా వుండేది. హైస్కూలు విద్య పూర్తికాగానే తన 17వ ఏట పూనా దక్కన్ కాలేజీలో ప్రవేశించాడు. కాలేజీ జీవితం ఆరంభంలో ప్రదర్శించిన ప్రతిభని ఆసాంతం కొనసాగించి, తన సహా

ధ్యాయులందరిచేత సహజ నాయకుడిగా అంగీకరించ బడ్డాడు.

సంగీతమంటే ఆయనకు మహా యిష్టం. భారతీయ సంగీతమంటే ఎక్కువ అభిలాష. అందులో ఖవ్వాలి అంటే మహా ప్రీతి. గంటల తరబడి ఆనందించేవాడు పాశ్చాత్య సంగీతమన్నా మక్కువే. మద్దెల, హార్మోనియం స్వయంగా వాయించిటమేకాక, వాటి లయలో లీనమై మధురంగా పాడేవాడు. తనగదిలో కూర్చుని కూని రాగాలు తీస్తూ వుంటే, వంట పనిలో తలమునకలైవున్న తల్లి ఆయన గాన మాధుర్యానికి అబ్బురపడి, ఒక చెవి కొడుకు పాటపై లగ్నం చేసేది. అంతలో పరాకుగావున్న తమ, పొయ్యిపై వున్న వంటకం మాడిపోయినా గమనించ లేకపోయేది. భోజనాలప్పుడు, యీ వేళ పోపు మాడిందేమనో, పప్పుఅడు గంటిందేమనో, అన్నం మాడిందేమనో ఎవరైనా అడిగితే, నేనేం చేయను. ఇందుకు బాధ్యుడు మేర్వాన్. వాడు పాడు తుంటే విని పరవశమైపోయి గమనించలేక పోయానసేది. సంగీతానికి పాములుసైతం నృత్యం చేస్తాయంటారు. అంత శ్రావ్యంగా పాడేవాడు మేర్వాన్.

కానీ మేర్వాన్ కాలేజీ చదువు పూర్తి చేయులేదు. తన జీవితంలో 18వ ఏడు అత్యంత ప్రాముఖ్యతను సంతరించుకుంది. 1913వ సంవత్సరంలో ఒకనాటి మిట్ట మధ్యాహ్నం ఆయన వునికికే హఠాత్తుగా భంగంకలిగింది. ఇక్కడ మన మొక విషయాన్ని గమనించాలి. మన మీ పుస్తకంలో మన మెరుగని ఒక వ్యక్తి గురించి చదువుకుంటు న్నాం. "అపరిచితవ్యక్తి" అని ఎందు కంటున్నానంటే,

యిందులో చెప్పే కథకు అంత మంటూ లేదు. అంత తేలిగ్గా అర్థం చేసుకోలేని మహా మనిషికి సంబంధించిన కథ యిది. భౌతికంగా ఆయన్ని చూచిన అంతర్దృష్టిలో అంతు చిక్కని అపరిచితుడాయన. ఇందులో నాకు ఆయన గురించి తెలిసిన విషయాల్ని వారిశిష్యులు, హితులు చెప్పిన విషయాల్ని యావదాంధ్ర ప్రేమిక లోకానికి తెలపాలన్నదే నాతృష్ణ.

ఆయన జీవితంలో జరిగిన ఘట్టాలుపరస్పర విరుద్ధంగా కనపడతాయి. ప్రతి చర్యా ఒక నీతిసందించేకథగా ఎంతో ప్రసిద్ధిగాంచినై. బాబా జీవిత చరిత్రని ఏవో నాలుగు మాటల్లో చెప్పినంత మాత్రం చేత సరిపోదు. ఆయన గురించిన చరిత్ర చాలా పేజీల్లో వున్నప్పటికీ, నా ప్రియ మిత్రులెందరో, యీముగావతారునిగా మెహెరవతార విశిష్టతని వ్రాయమని ప్రోద్బలం చేయగా ఆయన వివరణ గురించి మీ ముందుంచదలచాను. నా దృష్టిలో, నిత్యం జరిగే ప్రాపంచిక వ్యవహారాలతో పోల్చి, ఆయన గడిపిన జీవితాన్ని నిగ్గు దేల్చాలన్న పరిశీలనతో ప్రయత్నించేవారు పొందే దేమీ వుండదు. ఆయన చెప్పిన ఆధ్యాత్మిక విషయాలు మన తెలివి తేటలకు అతీతమైనవి. ఆయన చెప్పిందంతా వేదాంతమే అయినా, ఆయన వేదాంతి కాదు. పని తీరు ప్రవక్తలా కనపడినా, ప్రవక్త కాదు.

ఆయన పని తీరు ప్రవక్తల కంటె కూడా గొప్పదని తెలుసుకో గలిగితేనే తప్ప ఎవరూ ఆయన్ని సరిగా అర్థం చేసుకోలేరు. అందుకే ఆయన జీవిత చరిత్ర చదువుకోబోయే ముందు దానిని ఎంతో విమర్శనా దృష్టితో అన్ని కోణాల నుంచి తెలుసు కోవలసిన అవసరం వుందన్న వుద్దేశ్యంతో

ముందుగా నేను పాఠకుల్ని కోరుతున్నాను. ఈ యుగంలో మన అదృష్ట వశాన, యుగావతారుడుగా అవతరించిన అవతారమే మెహెర్ బాబా యొక్క జీవిత విశేషాల్ని ముచ్చటించుకుంటున్నాం. యిప్పటివరకు ఆయన భౌతిక జననం గురించి చెప్పుకున్నాం. యిప్పుడాయన బాహ్య కార్యక్రమాల గురించి క్లుప్తంగా చెప్పుకుందాం.

మెర్వాన్ డక్కన్ కళాశాలలో చదువుతున్న రోజుల్లో పూనా నడి బొడ్డున 107 సంవత్సరాల వయో వృద్ధురాలు హజరాత్ బాబా జాన్ అనే సద్గుర్విణి ఒక వేప చెట్టు క్రింద రోజంతా గడుపుతూ అక్కడే శాశ్వత పీఠాన్ని ఏర్పాటు చేసు కొని వుండేవి. విశ్వ విఖ్యాతి పొందిన గురువుగా యీమె సందర్శనార్థం, నిత్యం వేలాదిమంది వచ్చేవారు. ఆమె దివ్య తేజస్సుకు ఆకర్షితులై ఆమె సమక్షంలో ఎంతో సేపు గడిపి, ఆమె బోధలు వింటూ వుండేవారు. రోజూ కాలేజికి వెళుతూ, ఆమె వద్ద గుమి గూడి వుండే జనాన్ని మెర్వాన్ చూస్తూనే వుండేవాడు.

కానీ, ఒక రోజు మధ్యాహ్నం మెర్వాన్ డక్కన్ కళాశాల నుండి తన సైకిల్ పై యింటికి తిరిగి వస్తుండగా అయిస్కాంతాన్ని ఆకర్షించే యినుము లా ఆమె వైపు ఆకర్షితుడై నాడు. అంతకు ముందు రోజుల్లో రోజూ తన తరగతులకు హాజరవుతున్న మెర్వాన్ ఎక్కువ సమయాన్ని యీ మహనీయురాలి చెంత గడుపుతూ వుండేవాడు. కానీ యీ రోజున తనకు తెలియకుండానే ఆమె మెర్వాన్ నుదుటిపై చుంబించటం జరిగిపోయింది. ఒక్క మాట కూడ మాట్లాడలేదు. కను బొమల మధ్య మౌనంతో పెట్టిన

కేవలం, ఒకే ఒక ముద్దుతో బాబాజాన్ మేర్వాన్‌లో అంత రంగిక శక్తిని ప్రవేశ పెట్టడంతో తెర తొలగించబడింది. ఆయనకు బ్రహ్మాండమైన అనుభూతి కలిగింది. చెప్పలేని ఆనందం, అనుభూతి కలగటం, దాదాపు తొమ్మిది నెలలు కొనసాగింది. రోజూ రాత్రిళ్ళు మేర్వాన్ బాబాజాన్ పాదాల చెంత ఆధ్యాత్మిక స్థితిలో గడిపాడు. కొన్నిరోజులు పాటు పూర్తిగా మగతలోనే మాటా పలుకూ లేకుండా వున్నాడు. దాన్నే సుప్తావస్థ అంటారు.

ఒకనాటి సాయంత్రం ఆమె బాగా మంచి ఉత్సాహంగా మాట్లాడే స్థితిలో వున్నప్పుడు మేర్వానువైపు చూపుడువేలు చూపుతూ, "యీ నా బిడ్డడు, యావత్ప్రపంచానికి బ్రహ్మాండమగు భావన కలిగించి, మానవాళికి మంచిని చేకూరుస్తాడు" అని ప్రకటించి, ప్రేమతో ఆయన్ని నిమురుతూ యింటికి పంపించింది. యీ విషయంగురించి బాబా కొన్ని దశాబ్దాలు గడిచింతర్వాత గుర్తుకు తెచ్చుకుని "బాబాజాన్ ఒక తృటికాలంలో నాకు ఆత్మసాక్షాత్కారపు అనంత ఆనందాన్ని గుర్తించేట్లు చేసింది" అన్నారు.

పరిణామ క్రమంలో, ప్రథమ మానవునిగా శరీర ధారణ చేసిన జీవుడు సద్గురువై, అంతకు మునుపెన్నడూ, అవతరించని అవతారుడవుతాడు. ఇతని ద్వారానే భగవంతుడు అచైతన్య దైవత్వంనుండి, చైతన్యంతో కూడిన దైవత్వంలోకి ప్రయాణాన్ని ముందుగా పూర్తి చేస్తాడు అంటే దైవం మొదటగా ఇతనిలోనే ఆ చైతన్యంతో మనిషిగా మారి, దైవంగా మారేందుకు చైతన్యాన్ని సాధి

స్తాడు. మానవాళికి విముక్తి ప్రసాదించేందుకు యితని ద్వారానే కాల ప్రమాణాన్ననుసరించి చైతన్యంతో మానవరూపంలో వస్తూ వుంటాడు. అయితే అవతారునిగా భూమి మీద అవతరించటం అంతతేలికగాదు. ఆయన్ని, అవతరింప చేసేందుకు, పంచ సద్గురువుల సహాయం తప్పనిసరిగా కావాలి. ముందుగా పంచ సద్గురువులు గుర్తింపబడాలి అప్పుడే అవతారుని అవతరణ జరుగుతుంది. దృశ్య ప్రపంచంలో బంధితులైన మానవుల నుద్ధరించేందుకాయన రాక అవుసరమున్నది. పంచసద్గురువులీ పుడమిపై వున్నప్పుడల్లా ఆయన పునర్దర్శనమిస్తూనే వుంటాడు. మొదటి రక్షకుడాయన. ఆయన ఎవరో, ఎప్పుడు దర్శనమిస్తాడో ఎవరికీ తెలియదు. చరిత్ర కందనిదాయన అవతరణ. ఆయన లేకపోతే చరిత్రే లేదు.

ఆయన మానవ శరీరంతో జన్మతానుకున్నప్పుడు, దైవమానవునిగా ఆయన్ని గుర్తించకలగడం మానవునిగా ఆయన్ని గురించి ఆలోచించడంపై ప్రభావితమవుతుంది. తన దైవ స్వభావంలో అనంత శక్తి, అనంతజ్ఞానం, అనంత ఆనందాల్ని కలిగివుంటాడు. యీ ప్రపంచమంతా అపరిపూర్ణత్వంలో నిండివుండటంవల్ల, శారీరకంగా ఆయన యీ అపరిపూర్ణత్వాన్ని పంచుకోవలసి వస్తుంది. అయితే యీ సత్యాన్ని ఆయన ఎరుకతో తెలుసుకుని వుంటాడు. అందుకే పైకి చూసేందుకాయన శరీరం కూడ మనలాగా, ఒకే రకంగా వున్నా, అది పూర్తిగా భిన్నమయింది.

మాయావరణలో నియమితకాలంలో శరీరధారణచేసి జన్మ తీసుకున్న భగవంతుడ్ని, అవతారునిగా అవతరింప

చేయటం సజీవులైన సద్గురువుల విధి. తానే మానవరూపంలో అవతరించిన భగవంతునిగా గుర్తించేట్లు వారు సహాయపడ తారు. బాబాజాన్ పెట్టిన ముద్దుస్పర్శ ద్వారా మేర్వాన్ భౌతిక ప్రపంచ చైతన్యాన్ని కోల్పోయాడు. స్మృతి కోల్పోయి అయోమయంగా పక్కలో పడుకున్న కొడుకుని చూచి తల్లి అతనికేదో జబ్బు చేసిందనుకుంది. మూడురోజుల పాటు అతడు కదలికలేని స్థితిలో వుండిపోయాడు. ఆ తరు వాత యాంత్రికంగా తిరగడొడిగినా కళ్ళటో చూచేవి. పిచ్చి వాని చూపులా వున్నాయి అతని చూపులు, నిద్ర లేకపోవ టంతో కళ్ళు వాచిపోయాయి. అతని వాలకం చూచి వాళ్ళ మ్మకి బాధ కలిగింది. పిచ్చెక్కిందని భ్రమించి, అందరితో అదే చెప్పింది. తరచూ అతడు బాబాజాన్ వద్దకు వెళ్ళటంవల్ల దానికామే కారణమనుకొని, ఆమె దగ్గరకు వెళ్ళి మా అబ్బాయికేమి చేశావో చెప్పమని వత్తిడ చేసింది.

బాబాజాను షిరీన్‌భానుని వూరడిస్తూ "అమ్మా! మేర్వాన్ నీ కుమారుడేకాదు. అతడీ లోకాన్నెల్లా మేలు కొలపవలసినవాడు అతడ్ని ఒంటరిగా వదలమని అతడ్ని గురించేమీ వ్యధ చెందవద్దని మృదువుగా చెప్పింది. అయితే, ఆందోళనా మనస్సుతో వ్యాకుల పడివున్న షిరీన్, దాని భావాన్ని గ్రహించలేకపోయింది. నిజమేమరి మనమే ఆమె స్థితిలో వున్నప్పుడు, ఆమె పడేవ్యధేమిటో వూహించవచ్చు. మేర్వాన్ ఈ స్థితిలో దాదాపు 9 నెలలపాటు నిద్రాహారాలు లేకుండా గడిపాడు. నిద్ర పట్టేందుకు మత్తుమందులెన్నో వాడారు. కానీ ఏమీ ప్రయోజనం లేకపోయింది. తన్మయ త్వంలో మునిగివున్న కొడుకు స్థితిని అర్ధం చేసుకోలేని తల్లి,

ఎందరో వైద్యులచేత వైద్యం చేయించింది. కానీ ఏ ఒక్క వైద్యుడు కూడా, వ్యాధేమిటో నిర్ధారించలేక పోయారు. జబ్బేమిటో తెలియకపోయే సరికి, తల్లి దాన్ని గాలి చేష్టగా భావించి, భూతవైద్యం చేయించింది. వాళ్ళుకూడ తనబిడ్డను మామూలు స్థితికి తీసుకురాలేకపోయారు.

కానీ షెరియార్జీ మాత్రం, ఆనాడు తాను కలలో విన్న అశరీరవాణి వాక్కును గుర్తుకు తెచ్చుకున్నాడు. తన అంతరంగంలో కుమారుడు చాలా గొప్పవాడని తెలుసుకో గలిగాడు. తన భార్యకు నచ్చ చెప్పేందుకు ప్రయత్నించినా, షిరీన్‌భాను మాత్రం భర్త ఓదార్పుకు మరీ రెచ్చిపోయింది. మేర్వాన్ మాత్రం వంటరి జీవితానికి అలవాటు పడ్డాడు. రోజంతా ఎక్కువసేపు ఏకాంతంగా గడిపేవాడు. అన్నపానా దులందు అయిష్టత చూపేవాడు. తల్లి అన్నం పెడితే, ఆ పళ్ళాన్ని తన గదిలోకి తీసుకెళ్ళి తలుపులు మూసుకొని డ్రాయరు సొరుగులో దాచేవాడు. ఒక్కొక్కప్పుడు అన్నాన్ని కుక్కలకు పెట్టేవాడు. చాలా నెలలు జరిగాక 1914లో ఒక రోజున హఠాత్తుగా మేర్వాన్ జీవితంలో తదుపరి ఘట్టం ప్రారంభమైంది. ఆ క్షణంనుండి, దివ్యానందానికి బదులు, ఈ ప్రపంచంలోని ఏ ఒక్కరూ అర్థం చేసుకోలేని వ్యథను అనుభవించాడు. ఆ బాధలనుండి విముక్తుడయ్యేందుకు, తన తలను గదిలోని చప్టాపైనా, గోడలపైనా కొట్టుకునేవాడు. తనను తాను నిలదొక్కుకోలేక పోయేవాడు ఈ యావత్తు జగత్తు తనపైనే వున్నంతగా, భారాన్ని మోస్తున్నట్లు బాధను అనుభవించాడు.

అయితే మేర్వాన్ పడుతున్న వ్యథను గ్రహించని

తల్లి, పరిసరాలు మారిస్తే స్వస్థత కలుగుతుందేమోనన్న భావంతో బొంబాయిలో వుంటున్న పెద్ద కొడుకు జామ్షెడ్జీ దగ్గరకు పంపుతుంది. అక్కడ సామాన్య ప్రపంచ సౌఖ్యాల్ని కొంతవరకూ అనుభవిస్తాడు. ఎక్కువదూరం నడవటం, సైకిలు తొక్కడం చేసేవాడు. అలా కొన్నాళ్ళు గడిచాక షిర్డీలోని సాయిబాబా వైపు ఆకర్షితుడయ్యాడు. చిన్ననాటి మిత్రుడు సెయిలర్‌ని వెంట తీసుకొని షిర్డీ వెళ్ళాడు. ఆ సమయంలో సాయిబాబా మేళతాళాలతో కాలకృత్యాలు తీర్చుకొని వస్తున్నాడు. చుట్టూ ఎందరో గుమి గూడివున్నా నడి రోడ్డుమీద, దుమ్ములోనే ఆయనముందు మోకరిల్లి సాష్టాంగదండ ప్రమాణాలాచరించాడు. సాయిబాబా వెన్ను తట్టిలేపి, మెర్వాన్ వైపు తీక్షణగా చూస్తూ "ఓ, పర్వర్దిగార్ అని సంభోదించారు. అంటే "సకల సిద్ధాంత కారకుడైన భగవంతుడా!" అని దాని అర్ధం.

ఈ సందర్భాన్ని వివరిస్తూ బాబా ఒక సారి "బాబా జాన్, నేనేమిటో తెలుసుకొనేటట్లు చేసింది. సాయిబాబా నేనెవరినో తెలుసు కొనేటట్లు చేశారు. కాగా ఉపా శనీమహరాజ్, ఎల్లప్పుడూ నావే అయిన, నా దైవ శక్తులను నాకు యిచ్చారు" అని చెప్పారు. సాయి దర్శన, స్పర్శ సమాగమం జరగగానే, మేర్వాన్‌లో ఉపాశనీమహా రాజనే మరో సద్గురువును కలవాలన్న ప్రేరణ ఆంతరంగికంగా సాయిబాబా చేత ప్రేరేపించ బడింది. అప్పట్లో ఉపాశనీ గత మూడు సంవత్సరాలుగా షిర్డీలోని ఖండోబా దేవాలయంలో ఏకాంతవాసం గడుపుతూ వుంటున్నాడు.

15/9/1996

4)

మేర్వాన్ ఉపాశినీ చెంతకు చే గానే, ఆదరించి చేర బిలిచి చిన్నరాతిని బలంగా తనవైపు విసిరి స్వాగతం పలికాడు. ఆ గులకరాయి విపరీతవేగంతో వచ్చి, బాబా జాన్ ఎక్కడ ముద్దు పెట్టుకుందో సరిగ్గా అదే స్థలంలో నొసట మధ్యగా తగిలింది. రాయి బలంగా తగలటంతో రక్తంచిమ్మి గాయమయింది. ఆ దెబ్బ గుర్తు నొసటిపై శాశ్వతంగా వుండిపోయింది. నిజాని కీదెబ్బ ద్వారా మహారాజు నుండి వచ్చిన దైవజ్ఞానపు దెబ్బ అయింది. యీ దెబ్బ ద్వారా తన భౌతిక చైతన్యాన్ని తిరిగి సంపాదించ కలిగాడు. అలా సంపాదించటంలో, తానంతకుముందు పొందిన భగవత్ చైతన్యానికి ఎటువంటి అంతరాయం కలగలేదు. ఫలితంగా, సాక్షాత్కారపు అనంతానందాను భూతిని ఎరుకతో అనుభవించకలిగాడు. ఉపాశిని మహారాజు దగ్గర దాదాపు తొమ్మిదేళ్ళు గడిపాడు.

యీ మధ్యకాలంలో మేర్వాన్ నాగపూరులోని, తాజుద్దీన్ బాబాను సందర్శించాడు. ఈ విధంగా ఆయన అయిదుగురు సద్గురువులను కలుసుకోవటంతో చక్రభ్రమణం పూర్తి చేసి, యీ భూమిపై భగవంతుని అవతరింపచేసే పంచ సద్గురువుల సమాగమాన్ని పరిసమాప్తం చేశాడు. చివరకు 1921వ సంవత్సరం జులై నెలలో సాకోరి వెళ్ళి డిశెంబరు వరకు దాదాపు ఆరు నెలలుపాటు మహారాజు సన్నిధిలో గడిపాడు. మేర్వాన్, మహారాజులు యిరువురూ చిన్న కుటీరంలో ప్రతిరోజూ రాత్రి తలుపులు వేసుకొని కూర్చునేవారు. ఈ కాలంలోనే మహారాజు, మేర్వాన్‌కు తానెవరో ఎరుకపరిచినట్లు బాబాయే స్వయంగా ఒకసారి

చెప్పారు. "బాబా జాన్ ఒక్క క్షణంలో నేనెవరినై యున్నానో గుర్తించేటట్లు నాకెలా ఎరిగించిందో, అలాగే మహారాజు నేనెవరినో తెలియపరచారు. ఒకనాటి రాత్రి మేమిరువురమూ కుటీరంలో వుండగా "మేర్వాన్! నీవు అవతారుడవు. నేను నీకు నమస్కరిస్తున్నాను. నీవు సనాతుడవు" అని ప్రకటించినట్లు బాబా వివరించారు.

మరో సందర్భంలో మెహెర్‌బాబా తన అవతార తత్వాన్ని వివరిస్తూ తన అనుచరులతో "బాబాజాన్ నాకు దైవానందాన్ని కలిగించింది. సాయిబాబా దైవశక్తినివ్వగా ఉపాశినీ మహారాజు దైవజ్ఞానాన్ని యిచ్చారు. నేను అనంత శక్తిని, అనంత జ్ఞానాన్ని, అనంత ఆనందాన్ని నేనే ఆ సనాతుడ్ని. అధునాతన ప్రపంచానికి ముక్తిని ప్రసాదించేందుకు వచ్చాను" అని ప్రకటించారు.

ఈ విధంగా మేర్వాన్ 9 ఏళ్ళపాటు పంచ సద్గురువుల సమాగమ ప్రాప్తి ద్వారా తన జీవితంలో ఊహ కందని రీతిలో, శారీరక మానసిక స్థితులు మారిపోయి, అసలా కాలంలో జరిగిన విషయాలేవీ ఎక్కువగా చెప్పలేకపోయారు. తన చుట్టూ వున్నవారిని అయోమయంగా నిరాశాభావంతో చూచేవారు. మన భావంలో, అప్పటి ఆయన అనుభవం, జ్ఞాన ప్రకాశాన్ని పొందిందనో, ఆయన అన్వేషణా ఫలితమనో అనిపించ వచ్చు. కానీ యిందులో ఆయన యిచ్ఛగానీ, ప్రమేయంగానీ లేదు. అసలేం జరిగిందంటే, ఆయన ఏదో ఉన్నత శిఖరాలకు ఎగరవేయబడటం కాక, అధః పాతాళానికి తోసి వేయబడి, ఎందుకూ పనికిరాని వాసిగా తయారు చేయబడినాడు.

దీన్నే యిలా చెప్పుకోవచ్చును. ఆయన అజ్ఞానంలో ప్రవేశించి, తెలియని తనాన్ని అనుభవించాడు. అనూహ్యమైన విధంగా, యీ కాలంలో శారీ క,మానసిక త్యాగాల్ని చెప్పలేని వేదనతో, వూహాకందనిఆనందంతోఅనుభవించాడు నిజానికిప్పుడు, ఆయన స్థితి, మనకు తెలిసిన పిచ్చివాని స్థితిలా, వుండేవె, ఒక మస్తువలె వుండేవె. అయితేబాహ్యంగా ఆయన స్థితి చూచే వాళ్ళకు అలా కనపడినా, వాటి కతీతమైన స్థితీ అది. యిటువంటి స్థితి గడించి పోయిం తర్వాత న్యాయానికి, మళ్ళీ తన నిజస్థితిని పొంది నప్పుడు, సరికొత్త మనిషిగా తయారవ్వాలి, కాని మెహెర్‌బాబా చివరికి నూతన స్థితిని పొందినా తిరిగి అదే యవ్వన యువకుడుగా మిగిలి పోయాడు. 19/9/92

అయినా, పంచ సద్గురువుల సమాగం జరిగి స్వావమ్యావస్తకు తిరిగి చేరటంలో ఎవరో ఆయన్ని తన మామూలు జీవితంనుండి, నిత్య దినచర్యలనుండి దూరంగా సరికొత్త పథంలోకి, నడిపించుకొని వెళ్ళారనేది మాత్రం నిజం. అయన తన తల్లిదండ్రులతో ఏ మాత్రం నివసించలేదు. అన్నలూ, తమ్ముళ్ళూ, చెల్లెళ్ళతో వుండలేదు. కానీ తన గతాన్ని మరిచిపోలేదు. జీవన యాత్ర సాగించాలనికానీ, మహాత్ముడిగా వుండాలని కానీ ఆలోచించ లేదు మామూలు మనిషిగా వుండిపోయినట్లు కనపడినా, సాధారణ మానవుని కతీతమైన రీతిలో గడిపారు. ఒకసారి బాబా చెప్పారు. తనకు 10ఏళ్ళ ప్రాయంలో ఒకనాడు బుద్ధుని చరిత్రచదువుతుంటే, తానే ఆ బుద్ధుడ్ని అన్న ఆలోచన వచ్చిందట. ఆ విషయాన్ని మరుక్షణంలోనే మరచి పోయారట. ఆయనలోని

గొప్పదనాన్ని గ్రహించటం, మన తెలివిని మించిన విషయ మవుతుంది, అందుకే మెహెర్ బాబా జీవిత చరిత్ర చదువుకో బోయేముందు, అన్ని కోణాలనుండి పరిశీలనగా తెలుసు కోవలసిన అవసరముందని నా భావన.

మొదట్లో బాబాజాన్ ముద్దు పెట్టుకున్నప్పుడు ఏదో తెలియని అద్వితీయ శక్తి తనలో ఆవహించినట్లు అనుభూతి కలిగింది. అయినా అది జరిగిన చాలా కాలానికిగాని ఏం జరిగింది, చెప్ప లేక పోయాడు. అలా ముద్దు పెట్టుకున్న రాత్రి తాను పక్కలో పడుకుని వుండగా, బాబాజాన్ కన పడి, చేయిపుచ్చుకొని జ్ఞానభూమికలన్నీ దాటిస్తూ నడిపించు కొని వెళ్ళిందట. అంటే ఆక్షణంనుంచే ఆయన జీవితంలో మార్పు వచ్చిందన్నమాట. చదువుకొనే రోజుల్లో చదివిన ప్రతిదీ బాగా గుర్తుంచుకోగలిగిన ఏక సంధాగ్రాహియైన మేర్వాన్ అనూహ్యమైన అనంతానందస్థితిని అనుభవించినా బయటకు చెప్పలేక పోయారంటే, దీనిని మరుపు అంటామా? ముమ్మాటికీకాదు. ఆయన మనకోసరం వచ్చి వుండకపోతే, మానవుడిగా పరిమిత చైతన్యం లేకపోతే, యీ పరిమితుల్ని వివరించటం సాధ్య పడదు.

మానవుడిగా మెహెర్ బాబా ఒక సద్గురువేకాదు, గురు వులకు గురువు. దీనిని వేదాంత పరంగా తెలుసుకో వలసిన అవసరంవుంది. ఆత్మజ్ఞానం పొందిన వారిని సద్గురువు అంటారు. వీరు ప్రకృతిపై ఆధిపత్యం సాధించినవారు. సత్యంతో సమైక్యమైనవారు. యిటువంటివారు తనఉనికికొని కేంద్ర స్థానంలో వుండి అన్ని పరిస్థితులపైన అదుపు కలిగి వుంటారు. వీరికి విషయ భోగలాలస వుండదు. పుణ్య పాప

మిశ్రమ కర్మ వాసనల వుత్పత్తి వీరి చిత్తమునందు కలగదు. వీరి అంతః కరణము కేవలం దైవానికి మాత్రమే నివాసమై వుంటుంది. అటువంటి మహనీయుల సాంగత్యం లభించటం అతి దుర్లభమని శాస్త్రాలు కూడ చెబుతున్నాయి. ఒక వేళ పుణ్య విశేషం చేత అటువంటి మహనీయుల సాంగత్యం లభించినా వారిని గుర్తించటం అసాధ్యం. వీరు లోకానికే శ్రేయోదాయకులు. అది వారి స్వభావము గ్రుడ్డివాడు సూర్యుని కళ్ళారా చూడలేక పోయినా, ఎండ తగిలి, వాడి చలి దూరమై పోతుంది. అలాగే మహనీయుల సహవాస భాగ్యంచేత, అజ్ఞాన విముక్తి కలిగి, మోక్ష ప్రాప్తి సిద్ధిస్తుందంటారు.

మెహెర్ బాబా యీ కోవకు చెందిన మహనీయునిగా మనమిప్పటివరకూ చెప్పుకున్న దాన్నిబట్టి గ్రహించవచ్చు. ఆయన ఆ విధంగా, తెలివి తేటలు పెంచుకునో, సహజవృత్తితోనో, లేక చదువుకునో, కాలేదు. సమాధిస్థితిల్ల, అత్యున్నత చైతన్య భూమికకు చేరి, యీ మాయకు అతీతుడనని, అంతవరకూ తన గురించి ఎలా వూహించుకున్నాడో అదంతా అసత్యమని తెలుసుకోగలిగాడు. ఆత్మసాక్షాత్కారమంటే యిదేనన్న మాట. మాయ తొలిగిపోయి, మేలుకొలుపు కలిగి దైవంతో సమైక్యమవటమన్నమాట.

ఈ విధంగా మేర్వాన్ తన 28వ ఏట సర్వస్వతంత్ర ఆధ్యాత్మిక గురువుగా పని చేయటం ఆరంభించారు. పూనాలో జనసాంద్రత అతిస్వల్పంగా వుండే ప్రాంతాల్లో, పొలాల్లో ఒక పూరిల్లు నిర్మించుకొని అందులో వుండటం సాగించాడు. అవతారునిగా ఆయన మంత్రాంగం 1921లో ఆరంభమైంది.

ఖుర్షీ 2/9/11

అప్పుడే తన చుట్టూ మండలి అనే పేరుతో ప్రథమ శిష్య బృందం ఆయనన్నాకర్షించింది. అందులో జో రాష్ట్రీయును లున్నారు హిందువులు, మహమ్మదీయులు వున్నారు. వీరిలో ఒకరు మొదటి సారిగా మేర్వానుని "మెహెర్ బాబా" అని సంబోధించటం జరిగింది. మెహెర్ బాబా!" అంటే దయగల తండ్రీ! అని అర్థం. యీ సార్థక నామమే యిప్పటికి చిర స్థాయిగా వుండి పోయింది. అంతకుముందే అనేకు లాయన్ని సరిగా అర్థం చేసుకున్నారో లేదో కానీ, కొంతమందితమంత తామే ఆయన పరిధిలోకి వచ్చారు. మరికొందరు బాబాజాన్ వుపాశినీ మహారాజులు సూచించగా వచ్చి చేరారు. కొంద రాయని చేత స్వయంగా ఆకర్షింపబడిన వారుకూడ వున్నారు. ఆ రోజుల్లో యీయన గురించి, బాబాజాన్, వుపాశినీ మహా రాజులు "యీ పిల్లవాడు, యిప్పుడు తన వేలికదలికమాత్రం చేత యావత్ప్రపంచాన్ని కదిలించ కలిగిన సమర్థత కలిగి వున్నాడు" అని చెప్పేవారు.

1922లో ఒకసారి మహారాజు ఒక పెద్ద సమావేశంలో మాట్లాడుతూ తన శిష్యుల్ని వుద్దేశించి, "నేను చెప్పేది జాగ్రత్తగా వినండి. నేను నా ఆధ్యాత్మిక ఛార్జికి సంబంధిం చిన తాళం చెవిని, యిప్పుడీ మేర్వానుకి వప్పగించాను. అందువలన యిహనుండి, మీరంతా అతడ్ని అంటి పెట్టుకొని వుండి, అతని ఆజ్ఞలకు తలఒగ్గి నడుచుకోండి!" అనిచెప్పాడు. యిలా సమయం గడిచిన కొద్ది ఎక్కువమంది శిష్యులుచేరారు స్త్రీలు, పురుషులు, తమ సర్వస్వం త్యజించి, ఆయనకు తమ జీవితాలను అర్పించుకొని ఆయన చెంతనే వుండి పోయారు. వారంతా కఠోరమైన నియమాలెన్నిటినోపాటిస్తూ, నిస్వార్థ

సేవలో నిమగ్నులై ఆయన చెంతనే వుండి పోయారు.

మొదట్లో పంచ సద్గురువుల సమాగమ ప్రాప్తితో సప్త భూమికలు అధిరోహించి. దివ్యోన్మాద స్థితిని పొంది చివరకు స్వామ్యావస్థకు చేరినప్పుడు భరింపలేని ద్విగుణీకృతమైన వ్యథలను ఎదుర్కొని, శక్తి సమీకరణాదక్షుడయినాడు. మేర్వాన్ అనుభవించే వ్యథను ఎరుగుటచేత, మహరాజు, ఆయన జీవిత బరువులను కొంత వరకు తగ్గించేందుకు తన చెంతకు రమ్మన్నా మేర్వాన్ వెళ్ళేవాడు కాదు. ఒక సమయంలో బాబాయే స్వయంగా యీ విషయం గురించి వివరిస్తూ, "మహరాజు నా అధ్యాత్మిక బాధానుభూతినితగ్గిస్తే ఆయన అపరిమితంగా ఆ బాధను అనుభవించాల్సి వుంటుందని నాకు తెలుసు. అందుకే నేనాయనవద్దకు వెళ్ళేందుకు యిష్టపడేవాడ్ని కాదు. ఆ తీవ్రమైన ఆధ్యాత్మిక బాధానుభూతిని ఆనందంతో నేనే అనుభవించాను" అని చెప్పారు.

ఆ రోజుల్లో కస్బాపేటలో కుటీరంలోఆశ్రమ జీవితం ప్రారంభించటానికి ముందు తల్లి షిరీన్‌మాయి, ఏదైనా యావృత్తి పెంచుకొని, ఉద్యోగ బాధ్యతల్లో వుంటే, స్థిమితపడతాడేమోనని భ్రమించింది. జీవనోపాధి కోసరం ఏదైనా వృత్తి గాని, వ్యాపారంగాని చేయమని బ్రతిమలాడింది. బాబా వయసప్పుడు 22సంవత్సరాలు. చెప్పగా చెప్పగా చివరకు బాబా తల్లిమాటకు తల ఒగ్గి ఆమె చెప్పినట్లు చేయటానికి ప్రయత్నించాడు. మూడుసార్లు ఉద్యోగం సంపాదించాడు. కానీ ఏ పనిలోనూ ఎక్కువ రోజులు నిలబడలేదు. అధ్యాత్మికావేశముగల ఒక అస్థిరుని పాత్రను బాబా ఆనాడు నిర్వహింపక తప్పలేదు. అ తర్వాత యింకా చాలా రకాల

ఉద్యోగాలు చేశారు. "ఖాన్ ఖాటన్" అనే నాటకం కంపెనీ పెట్టి దాని వ్యవస్థాపకుడుగా కొన్నాళ్ళు గడిపారు. ఆకంపెనీ పెట్టిన రెండు నెలల్లోనే దాని అధికారి మరణించటంతో దాన్ని ఎత్తి వేశారు.

ఆయన తండ్రి షెరియార్జి ఒక టీదుకాణ నడుపుతూం వుండేవాడు. తండ్రికి తోడుగా వుంటాడని టీ షాపులో వుంచారు. రోజూ టీ పాట్ లో టీ కలిపి వుంచగానే మొదటి కప్పు టీని బాబాజానుకు ముందుగాయిచ్చి వచ్చేవాడు. ఒక అట్టపై "యీ రోజుకూడ గడిచిపోతుంది!" అని వ్రాసి టీ షాపులో వ్రేలాడదీశాడు. అందరూ దాన్ని చూచి అదేమిటో అర్ధ కాకపోయినా తలా ఒక రకంగా వ్యాఖ్యానించుకుంటూ చర్చించుకునేవారు. తండ్రయితే ఏ రకమైన వ్యాఖ్యానం చేయలేదు కాని, తల్లికీ విషయం అవగాహన కానందున కొడుకునే అడిగింది. మన జీవిత గమనం వేగంగా గడిచిపోతున్నది. ఈ విశ్వమంతా మృత్యుదేవత దయపై ఆధారపడివుంది. వార్ధక్యం నలువైపులా బెదిరిస్తున్నది. దివారాత్రులు ఈ జీవితాన్ని దిగమింగుతున్నాయి. మానవుడు పంజరంలో తిరిగె పక్షిలా వున్నాడు. తెలివైనవారు ప్రతి రోజు, ప్రతిక్షణం అత్యంత విలువకట్టి జాగ్రత్తగా గడుపుతారు. మనకు రేపనునది నమ్మకంలేదు. అందువలన, మనం సరియగు సమయంలోనే వుత్తమ విధానాన్ని అవలభించాలి. యిహాముందు సుఖశాంతులు వెల్లివిరియగలవన్న ధర్మాన్ని ఆచరించాలి. ఈ సత్యాన్ని నర్మగర్భంగా తల్లితో చెపుతూ మెహెర్ బాబా మితోపభోగాలు అనుభవిస్తూ నైరాశ్యంతో

తృప్తిగా జీవితం గడిపి మృత్యువునెదుర్కొన్న ని ముక్తిని సాధించాలని, ఏరోజుకారోజు ఎలాగోలా గడిచిపోతుందన్న ధీమాతో బ్రతకాలని దాని అర్థమని చెబుతారు. 6/10/99

మెహెర్ బాబా తన అవతార కాలంలో గడిపిన నవ జీవన కాలంలోకూడా ఈ సత్యాన్ని శిష్యులు తెలుసుకునేందుకు, వాళ్ళందరిచేత "నిన్న గడిచిపోయిందెలాగో, నేడు కూడా గడిచిపోతుంది అది గడుచు రీతిలో. మరి రేపు గురించి, చింతెవరికి? గడిచిపోతుందిలే!" అన్న గీతాన్ని రోజూ ఆలాపించేట్లు చేశారు. ప్రతి ప్రాణికీ కాలము అతి భయంకరమైంది అది జీవితంలో అన్నిటినీఅధిగమించే మహామ్మారి. యిటువంటి పరిస్థితుల్లో మానవుడు కోరతగిన అత్యుత్తమ విధానం, మనస్ఫూర్తిగా దైవాన్ని ప్రేమించటం, ఆయన్ని ఆరాధించడం, ప్రాపంచిక సౌఖ్యాలు కావాలనికాని, భోగ భాగ్యాలనుభవించాలనికాని, భౌతిక సంపద కావాలని కానీ కోరటం కాదు, మనం కోరవలసింది. క్షుద్రమైన కోర్కెలు విస్మరించి ఆయన్ననుసరించాలి. అప్పుడు మన అవుసరాలను ఆయనే చూచుకుంటాడు. అందుకే బాబా నా కొంగు గట్టిగా పట్టుకోండని హెచ్చరించారు.

తండ్రి టీ దుకాణంలో పని చేస్తున్న రోజుల్లోనే, షెరియార్జీ వార్ధక్యం కారణంగా అనారోగ్యానికి గురై, జబ్బు చేస్తుంది. చికిత్సకై బొంబాయి వెళ్ళాల్సిరాగా, బాబాయే టీ దుకాణాన్ని నడపవలసి వచ్చింది. ఆయన అజమాయిషీలో టీ దుకాణం లాభసాటిగా నడవలేదు. తన మనస్సును వ్యాపారంపై కేంద్రీకరించకుండా, ఎక్కువగా ఏకాంతవాసంలో గడపటంతో కాతాదార్లు మోసం చేసే

వాడు. తండ్రి చికిత్సానంతరం బొంబాయినుండి తిరిగివచ్చాక నష్టాల పూవిలో కూరుకున్న టీ దుకాణాన్ని ఎత్తివేసి, సారా దుకాణం పెట్టాడు. ప్రభుత్వ లైసెన్సుతో కస్బా పేటలో సారా దుకాణం నడిపేవారు. మెహెర్ బాబాకూడా ఈ సారా దుకాణంలో తండ్రికి చేదోడువాదోడుగా చూచే వారు. అయితే కాతాదారులు, టీ దుకాణంలో మాదిరిగానే యిందులోకూడ, బాబాని మోసపుచ్చారు.

ఇదీ లాభం లేదని బెహ్రాంజీ అనే స్నేహితునితో వాటా కలిసి, స్వంతంగా ఓ కల్లంగడి ప్రారంభించాడు. మెహెర్, బెహ్రాంజీలు యిరువురూ ఈ కల్లు దుకాణంలో భాగస్వాములు. ఉదయం, 6-00 నుండి 12-00 గం॥ వరకు సీసాలు కడగటం, నేల శుభ్రం చేయటం, కాతాదారులకు కావలసిన కల్లు సరఫరా చేయటం బాబావంతు. కల్లు వ్యాపారాన్ని చేస్తున్నాడేకానీ, కల్లు మత్తు పానీయమని, ఆరోగ్యానికి హానికరమని, తాగవద్దని తన దుకాణానికి వచ్చే కాతాదారులకు హితబోధ చేశేవాడు. వారంతా పేదవారైన పాకటపు జనం కనుక, అసలు తాగుడు మానమని ప్రబితిమలాడేవాడు. ఈలోగా సహాయ నిరాకరణోద్యమం వచ్చింది. సారా దుకాణాలు, కల్లంగళ్ళు పికెటింగు చేయబడ్డాయి. ఆ సమయంలో బాబా షాపును పూర్తిగా ఎత్తివేశారు.

బాబా యిన్ని నీచమైన పనులు చేయటానికి కారణాన్ని స్వయంగా వివరిస్తూ, "తాను అత్యున్నత ఆధ్యాత్మిక స్థాయి యందుండుటవల్ల యిటువంటి నీచమైన పనులు అలవరుచుకోవలసి వచ్చింది" అంటారు. మనుజ రూపధారియైన భగవంతుడు కనుక, అవతార పురుషుడు తన వ్యక్తిత్వం

లో భగవంతుని విశ్వచైతన్యాన్ని, మానవుని పరిమిత చైతన్యాన్ని కూడా ఒకే సమయంలో కలిగివుంటాడు. అది ఒక విచిత్రమైన ద్వందసంయోగం. ఆయనలో భగవంతునికి చెందిన అనంత శక్తి, మానవునికి చెందిన సహజ బలహీనత రెండూ కలిసివుంటాయి. అందుకే బాబా "మానవాళికోసరం నేనుపడే బాధకంటే ఘనమైనదీ, మహిమాన్వితమైనది మరింకేదీ లేదు" అన్నారు. ఈ విధంగా మానవాళి కోసరం నిరంతరం బాబా అతి నీచమయిన కార్యక్రమాలు కూడ చేసేందుకు వెనకాడక, హింసను, అవమానాన్ని సైతం లెక్క చేయక అన్నిటినీ సహించగలిగారంటానికిది నిదర్శనం.

అవతారుడుగా మాయలో జీవించే భగవంతుని జీవితం, మాయన్వితం కాదు. సృష్టిలో భగవంతుని నిజమయిన జీవితంలో సత్యమూ, మాయా రెండూమిళితమైవుటాయి. ఈ మాయలో భగవంతుడు మాయా జీవితాన్ని సాగిస్తున్నా, భగవంతుని సత్యాన్ని గురించి, ఎరిగే వుంటాడు. భగవంతుడు సర్వ స్వతంత్రుడు. ఈ విశ్వమంతా విశ్వనాధునిపై ఆధారపడి వున్నది. భగవంతుడు మన సహచరుడవటంకోసరం రూపందాల్చి శరీరధారియై దిగి వచ్చాడు. యిప్పుడాయన మనల్ని తన సహచరులుగా తయారు కమ్మంటున్నారు. మనం సహజమైన జీవితాన్ని గడిపితేనే ఆయన సహచరులం కాగలుగుతాం. సహజంగా మనం ఒట్టి అవివేకులం. యింకా చిన్నపిల్లల మనస్తత్వం మనది. ప్రేమ, దయ, నిష్కపటం గురించి, బోధల్లో చెబితే అర్థం చేసుకోలేం అందుకే భగవంతుడు ఈ యుగావతురుడుగా, మెహెర్ బాబాగా అవతరించి, నోటి మాటలతో కాక, ఆచరణలో తానాచరించి, ఆదర్శ

వంతమైన తన నిజ జీవితంలో జరిగే ప్రతి సంఘటన మనకు ఆత్మ ప్రబోధాన్ని కలిగించేట్లు గడిపారు.

ముందుగా పూనా కస్బాపేట ప్రక్కనే వున్న నది కావలి వైపు జనసంచారంలేని పొలాల్లో ఒక కుటీరం కట్టుకుని తన మంత్రాంగం సాగిస్తున్న రోజుల్లో, మేర్వాన్‌సాటి కులంవారి యీసడింపుల్ని ఎదుర్కొన్నాడు. కొందరుఆచార వంతులైన సనాతన జొరాష్ట్రియనులు మేర్వాన్ భావాల్ని వ్యతిరేకించి, అతడు తమ కులంలో తప్పు పుట్టాడని వ్యతిరేకించారు. అతని ప్రతిచర్యా గమనిస్తూ సమయం దొరికితే చాలు తల్లికి చాడీలు చెప్పి, అతనిపై నింద మోపే వారు. సాటివారి ఈసడింపులకు తల్లడిల్లినతల్లి ముద్దుల కొడుకుపై వారు చూపే అనాదరణకు తట్టుకోలేక పోయింది. పెళ్ళిళ్ళు, శుభకార్యాలకు కూడా, యిల్లు కదిలి ఎవరింటికీ వెళ్ళేది కాదు. బయటకు వెళితే ఎవరినోటివెంట ఏ విమర్శ వినాల్సి వస్తుందోనని ఆమె భయం. ఆఖరికి సినిమాలు చూచేందుకు కూడ వెళ్ళేది కాదు. దీనికి కారణం వేరే వుంది.

మేర్వాన్ అంటే తల్లికి ఎంతో ప్రేమ. అసలుమొదటి సంతానమైన జంషెడ్జీ పుట్టినప్పుడు ఆమెలో మాతృత్వం కలగలేదు. బొమ్మలతో ఆడుకున్నట్లు చూచేదే కానీ కన్న కొడుకులా చూచుకోలేక పోయింది. మేర్వాన్ పుట్టగానే ఆమెలో మాతృత్వం మేల్కొంది. ఆమెకు ఎనిమిదిమంది సంతానం కలిగినా, షిరీన్ మాత్రం తన జీవితాన్ని మేర్వాన్‌కే వప్పగించింది. ఆమెకుతెలియకుండానే ఆమెలో బాబాపై అవ్యాజానురాగం పుట్టుకొచ్చింది. మణీ పుట్టే వరకూ, ఆమెకు పుట్టిన పిల్లలంతా మగ సంతానమే. ఆఖరి

13/10 AAL

సంతానం మణిజాయిరాని. ఆడపిల్ల పుట్టలేదని తల్లి పరితపించి పోయేది. బాబా బాల్యంలో వుండగానే తల్లి షిరీన్‌మాయి గర్భవతియై వుంది అప్పట్లో బాబాజాన్ స్పర్శతో మేర్వాన్ తన్మయావస్థలో మునిగి తేలుతున్నాడు. అదే సమయంలో షిరీన్‌మాయి ప్రసవ సమయం సమీపించింది.

ప్రసవసమయంలో షిరీన్‌మాయిని హాస్పటల్లో చేర్చారు. మేర్వాన్ తల్లిని చూచేందుకు హాస్పటల్‌కి వెళ్ళి ఆమెకు సపర్యచేస్తున్న నర్సుతో, యిప్పటివరకూ మాఅమ్మకు అంతా మగ పిల్లలేనని, యీ సారి అడపిల్ల పుట్టాలని వెళ్ళాడట. ఆయనకోరిక మన్నించిట్లు, ఆసారి షిరీన్‌మాయికి ఆడపిల్లే పుట్టింది. తల్లి ప్రసవవేదన పడుతున్నప్పుడు అమె చుట్టమొకరు పర్షియన్ కథనొక దానిని చదివివినిపిస్తున్నారు. ఆ కథలో వచ్చే రాజుగారి కూతురైన యువరాణి కథానాయకురాలు. ఆమె పేరు మణిజా. యీ యువరాణి పేరే పుట్టిన పిల్లకు పెట్టారు.

అయితే, అప్పటికే పూర్ణస్థితికి చేరిన మేర్వాన్, యిల్లు వదలటం యీ పిల్ల పుట్టడం యాదృచ్ఛికంగా ఒక్క సారే జరిగి పోయాయి. లేలేక ఆడపిల్ల పుట్టిందన్న సంతోషం ఒక ప్రక్క నున్నా, తల్లి మాత్రంఆ పిల్ల పుట్టిన వెళా విశేషంచేత కొడుకు యింటిపట్టున లేకుండా పోయాడని విలపించేది. కన్నకూతురిపై ఆప్యాయత కొరవడింది. పాలకోసం ఏడిస్తే పసిపిల్లను పట్టుకొని, "నువ్వుపుట్టి నా కొడుకుని నాకు కాకుండా చేశావు" అని నిందించేది కానీ సముదాయించేది కాదు. వుయ్యాల్లో ఏడుస్తున్న చంటిదాన్ని వూపుతూ ఒక రోజున తల్లి పైవిధంగా నిందిస్తుండగా మేర్వాను హఠా

త్తుగా ఆగదిలోకి వచ్చి తల్లి చేస్తున్న నిందారోపణ విన్నాడు. తల్లిని వూరడిస్తూ "అమ్మా! అనవసరంగా చంటి పిల్లను నిందించకమ్మా. మణీ చాలా అదృష్ట వంతురాలమ్మా! ఆమె చాలా అదృష్టవంతురాలు." అంటూ కాసేపు వుయ్యాల స్వయంగా వూపి, ఆపైన శాశ్వతంగా యిల్లు వదిలి వెళ్ళి పోయాడు.

దీనికితోడు, ఆ రోజుల్లో షెరియార్జీ ధనవంతుడైన ఒక మిత్రునితో కలిసి, తాటితోపుల్ని వేలం పాటలోపాడు కోని కల్లు వ్యాపారం చేస్తున్నాడు. మిత్రుడిపై నమ్మకంతో జమా ఖర్చులుసైతం, సరి చూచుకునేవాడు కాదు. అతడేమి చెపితే అదే నమ్మేవాడు, అతని అమాయకత్వాన్ని ఆసరగా తీసుకుని భాగస్వామి చివరకు అంతా నష్టం వచ్చినట్లు చెప్ప డమే కాక, ఆవ్యాపారంతో తనకేమీ సంబంధంలేనట్లు తన వంతు భాగస్వామ్యాన్ని వదులుకుంటున్నట్లుకొన్నిపత్రాల్ని సృష్టించి, అందులో ఎముందో తెలియనీయకుండా షెరి యార్జీ సంతకాలు తీసుకున్నాడు. వున్న డబ్బంతా ఆ వ్యాపారంతో పెట్టడంలో పాపం, షెరియార్జీ, "యీ వ్యాపారంతో నాకేమీ సంబంధం లేదు. నీయంతట నీవే సంతకం చేసి వ్రాసిచ్చావని" తన సంతకంతో వున్న కాగి తాలు చూపినపుడు, ఎమాత్రం చలించకుండా అంతా భగ వంతుని యిచ్ఛ. నీ యిష్టం" అని అంటాడేకాని ఎమీ నిందిం చడు.

కానీ అమాయకుడైన భర్త స్నేహితునివల్ల మోస పోయాడని, న్యాయాన్ని నిగ్గు దీయాలని సంకల్పిస్తుంది. దీనికి యిరుగు పొరుగు వారి పోరుకూడ ఎక్కువౌతుంది.

యింత అన్యాయం చేసిన వాడ్ని వదలటానికి వీలు లేదని దృఢ నిర్ణయానికి వచ్చి లాయర్ని సంప్రదిస్తుంది. న్యాయం మీవైపే వుంది. కానీ మీఆయన సంతకాలు తనకు తెలియకుండానే పెట్టినట్లు కోర్టులో చెప్పాలని లాయరు సలహా చెప్పాడు. నగ అమ్మి, కోర్టులో వ్యాజ్యం నిజంగా వేయించింది. భర్త ముందుగా ససేమిరా యీ వ్యాజ్యం మన కొద్దు. వాడి ఖర్మ వాడే అనుభవిస్తాడని ఎంత చెప్పినా షిరీనా వినిపించుకోదు. అయినా యిరుగు పొరుగువారి ఎత్తి పొడుపులుతో అహం పెల్లుబికిన షిరీనామాయి, నలుగుర్లో తాను తలెత్తుకు తిరగాలంటే జరిగిన అన్యాయం చట్టపరంగా బహిర్గత పడాలన్న ఆకాంక్షతో కోర్టెక్కింది. తీరా కోర్టు విచారణలో షెరియార్జి "తన సంతకాన్ని చదివిచేసినా, చదవకచేసినా, అది తాను చేసిన సంతకం కనుక దీనిలో వ్రాసివున్న దానికి నేను కట్టుబడి వుండాలి. యిహపోతే అతడు చేసింది మోసమే అయినా, దీని రీత్యా చట్టాన్ని కళ్ళుకప్పినా, ఎప్పటికీదైవం కళ్ళు మాత్రం కప్పలేడు. దాని ఫలితం అతడు అనుభవించి తీరుతాడు." అని నిర్లిప్తంగా అంటాడు. ఫలితంగా కేసు వీగిపోతుంది.

దీనివల్ల, వున్నదంతా వూడ్చుకు పోవటమేగాక, వాడకట్టలో తలెత్తుకు తిరగలేక పోయింది తల్లి. యీ విధంగా దైవం ఆమెలోని అహాన్ని ఆమెకు తెలియనీకుండానే హరించి వేస్తున్నాడన్నమాట. ఉళ్ళో కొందరు జోరాష్ట్రియన్ మతస్తులు ఒక బృందంగా ఏర్పడి మేర్వాన్ చర్యల్ని నిరసిస్తూ షిరీన్ కుటుంబాన్ని దాదాపు వెలి వేశారు దాంతో ఆమె మరీ కృంగి పోయింది. తండ్రి ఎవరెంతగా యీసడించినా

ఏమీపట్టనట్లు నిర్లిప్తంగా వుండిపోయేవాడు. మేర్వాన్‌లోని ఔన్నత్యాన్ని ఆయనగుర్తించాడు. మేర్వాన్‌కు పదేళ్ల వయసున్నప్పుడు, రోజూ పొద్దునే తన తండ్రికి నమస్కరించేవాడని, అయితే తరువాత రోజుల్లో తన తండ్రే కొడుకు ఫోటోకు నమస్కరించి అగరవత్తులు వెలిగించేవాడు. తల్లి మాత్రం కొడుకును పుత్రవాత్సల్యంతోనే చూచుకుందికానీ, ఆయనలోని దైవత్వాన్ని గ్రహించలేకపోయింది. పైపెచ్చు, సాటి కులంవాళ్ళ యీసడింపుతోడై, కొడుకులోని ఔన్నత్యాన్ని గుర్తించలేకపోయింది. 16/10/94

ఆయన్ని సాక్షాత్తు భగవంతునిగా ఆరాధించే వాళ్ళు అప్పటికే కొందరున్నా, సనాతన జోరాష్ట్రియనులు మాత్రం అతడ్ని పూర్తిగా వ్యతిరేకించి, యీసడించేవారు. తల్లిని ఎత్తి పొడిచేవారు. ఆమె అసలే మూఢాచారాలుకల వ్యక్తవటం వల్ల సాటికులం వాళ్ళు వచ్చి కొడుకును తప్పు పట్టడంతో, యిటు కొడుకును మందలించలేక, అటు సాటి వారిని నిరశించలేక మానశికంగా నలిగిపోయి, యిల్లు కదిలి బయటకు వెళ్ళేది కాదు. అక్కరపడ్డప్పుడుకూడ ఎవర్నో పంపేది కానీ సాధ్యమైనంత వరకూ తను వెళ్ళకుండా తప్పించుకొనేది.

ఒకరోజున పూనా మహానగరంలో ప్రముఖ అమెరికన్ డ్యాన్సరు ఒకరి నృత్య కార్యక్రమం ఏర్పాటు చేయబడింది. ఎందరో పురప్రముఖుల్ని కార్యక్రమానికి కాహ్వానించారు. షెరియార్జి కుటుంబానికి కూడా ఆహ్వానం వచ్చింది. ఎందుకో గానీ, అంతకు ముందే పిబహిరంగ కార్యక్రమానికి

హాజరు కానీ షిరిన్ భానూ, భర్తా పిల్లల్ని వెంట పెట్టుకొని యీ కార్యక్రమానికి హాజరైంది. అందులోనూ, ఆనాడు వీరి కుటుంబానికై ప్రముఖులకు కేటాయించే మొదటి వరుస సీట్లను కేటాయించారు. మేర్వాన్ తలిదండ్రులతో పాటు గా లేదు. ఆలస్యంగా, యిహ కార్యక్రమం ప్రారంభం కాబోతుం దనగా వచ్చాడు. అతని కోసరం, ముందు వరుసలోని మధ్య కుర్చీ కేటాయించారు. ఆది ఆయన వచ్చేవరకూ ఖాళీగా వుంది.

వీళ్ళతో పాటు, సమయం దొరికితే విమర్శనా బాణాలు వదిలి, అల్లరి పెట్టి అవహేళన చేయాలని ఎదురు చూసే బృందం వారు కూడా యీ కార్యక్రమానికి వచ్చి అవసరం వస్తే అల్లరి చేయాలని హాల్లో వెనుకగా కూర్చు న్నారు. అంతలో, కార్యక్రమం ప్రారంభం కాబోతుం దన్నంతలో మేర్వాన్ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ హాల్లో ప్రవేశించేసరికి, సభా నిర్వాహకులు సాదరంగా స్వాగతం చెప్పి, ముందు వరుసలో ఆయనకు కేటాయించిన సీట్లో కూర్చో పెట్టారు పెద్దలంతా వినయంతో నమస్కరించి ఎవరి స్థానాల్లో వాళ్ళు కూర్చున్నారు. ఇదంతా చూచి తల్లి విస్తుపోయి గమనిస్తోంది. అంతలో ప్రఖ్యాత డ్యాన్సరు స్టేజి దిగి మేర్వాను ముందుకు వచ్చి. పాదాభివందనం చేసి, ఆయన ఆశీర్వాదాలు పొందిన తర్వాత తన నృత్యాన్ని ప్రారంభించటంతో, తల్లి నే కాక, వారి కుటుంబాన్నే పని కట్టుకొని విమర్శించే బృందం వారికి కూడ కనువిప్పైంది. తల్లి మేర్వానులోని దైవత్వాన్ని మొదటి సారిగా గుర్తించ కలిగింది. 2/10/19

దీన్ని బట్టి మెహెర్ బాబా అవతార కార్యక్రమం అప్పటికే ఆరంభమైనట్లు గ్రహించవచ్చు. అవతారుని కార్య క్రమంలో జరిగే ప్రతి చర్య, కదలికలకు, మనకు తెలియని ప్రత్యేకత ఏదో దాగివుండి తీరుతుంది. అవతారునిగా, మేర్వాన్ మంత్రాంగం పూనా లోని కస్బా పేటలో 1921 లో ప్రారంభించబడిన వెంటనే ఆయన దగ్గర చేరిన శిష్య బృందం క్రమంగా పెరగనారంభించింది. ఆయన్ని తమ ఆధ్యాత్మిక మార్గదర్శకుడుగా గుర్తించి తమ జీవితాల్ని మలిచేందుకు సర్వార్పణ అయ్యారు.

రోజులు గడిచేకొద్దీ అధిక సంఖ్యలో శిష్యగణం పెరిగింది. కనీసం పన్నెండుమంది సహచరులు ఆయన్ని ఎప్పుడూ అంటిపెట్టుకొని వుండేవారు. రాత్రిళ్ళు బెహ్రాలీ అనే శిష్యుడు కావలివుండేవాడు. కొన్నాళ్ళకు అర్జున్ సువే కర్ అనే మరో శిష్యుడు కూడా రాత్రి కావలా కాసేవాడు. ఆయనవద్ద మొదట్లో శిష్యులుగా చేరిన వారిలో తనతో చదువుకున్న చిన్ననాటి స్నేహితులు, సమీప బంధువులు ఎక్కువగా వున్నారు. రోజు వుదయాన్నే వారంతా ఆయన దగ్గరకు వచ్చి భక్తి గీతాలు పాడేవారు. సంగీత వాయిద్యాలు మోగిస్తూ గాన మాధుర్యంలో తేలి పోయేవారు.

శిష్యుల్లో అన్ని మతాల కులాల వారుండటంతో పార్శీ, హిందూ ముస్లిం పండుగలు చేసుకునేందుకు వారిని అనుమతించేవారు. నిత్యం కొంతసేపు బాబా ఆధ్యాత్మిక ప్రసంగాలు చేసేవారు. ముఖ్యంగా శిష్యులకు ప్రాపంచిక వ్యవహారాల్లో జోక్యంచేసుకోకుండా వుండేట్లు క్రమశిక్షణతో

జీవితం గడిపే శిక్షణ యిచ్చారు. ఎవరైనా మామూలు గొడవలేమైనా తెచ్చినా, ఆధ్యాత్మిక విషయాల మీదకు వారి మనస్సు మరిల్చేట్లు చేసేవారు. ఆయన హాస్యప్రియుడు మోటుహాస్యం కాక, తమాషా కబుర్లు చెప్పి నవ్వించడం ఆయన చతురత. గురువుగా ఆయన దర్శనార్థం జనం చాలా మంది రావడం సాగించడంతో వారంలో ఒక్క గురువారం నాడు మాత్రమే యాత్రీకులకు దర్శన మిచ్చేవారు. తక్కిన రోజుల్లో శిష్యులతో ఏకాంతంగా వుండేవారు.

ఎవరైనా సాధకులు ఆయన దర్శనానికి వస్తే, వారి కష్టసుఖాలు కనుక్కొని, తమ సానుభూతిని చూపటమే కాక, కరుణారస ప్రేమ పుట్టిపడేలా సంభాషించేవారు. ఆయన ప్రతి వక్కరితో, ఎంతో కలిసిపోయి, స్వేచ్ఛగా సంచరించేవారు. వారితో ఆటపాటలాడేవారు. వారితో పరాచికాలాడుతూ, కథలు, కబుర్లు చెబుతూ గడిపేవారు. ఆయన యందు నమ్మకం కలిగి, ఏరకమైనా సంబంధం లేకుండనే, ఆయనలోని, నిరాడంబరం, నిస్వార్థం, అప్యాయతలకు ప్రభావితులై ఆయన వైపు ఎందరో ఆకర్షితులయ్యారు.

ఆయన అతి సామాన్య జీవితాన్ని గడిపేవారు. మితంగా నిద్రపోయేవారు. ఎక్కువ కాలం ఏకాంతవాసంలో గడిపేవారు. తరచుగా వుపవాసాలుండేవారు. యీవుపవాసాలు, తరువాత రోజుల్లో నెలలకొద్ది చేసేవారు. ఏమైనప్పటికీ యితరుల విషయంలో ఉపవాసం చేయాలన్న నిబంధనలేవీ విధించలేదు. బాహ్య త్యాగం కొద్ది విలువే కలిగివుంటుందని, దైవాన్ని చేరే మార్గంలో లెక్కకు

వచ్చేవి, నిష్కపటం, అంతరంగం నుండి జనించే త్యాగమని ఆయన చెప్పేవారు. ఆయన వైపు వివాహితులు, అవివాహితులు, ధనవంతులు, కడుపేదవారు, మేధా సంపన్నులైన విజ్ఞానులు, అజ్ఞానులు, స్త్రీ పురుష భేదం లేకుండా ఎందరో ఆకర్షితులయ్యారు.

ఆయన శాకాహారి. మత్తు పానీయాలు పుచ్చుకోరు. పొగ త్రాగరు. అన్నంలో రుచి పాకాలక్కర లేక పోయినా ఆయనను తృప్తి పరచటం కష్టం. పాశ్చాత్య దేశాల్లో ఆయన పర్యటించే రోజుల్లో కొంతమంది బ్రహ్మాండమైన భోజన ఏర్పాట్లు చేసి ఆయన్ని తృప్తి పరచాలనుకొని తీరా ఎంతో బ్రహ్మాండంగా విందు ఏర్పాటు చేస్తే చివరికి బాబా తిన్నది, ఆపదార్థాలన్నిటి మధ్యావున్న రొట్టిముక్కలో ఒక చిన్న ముక్క, ఆయన తినాలని తినరు కాని తినటంలో అభిలాష కనపడదు. ఆహార నియమం పాటిస్తారనటానికీ వీల్లేదు. అప్పుడప్పుడూ పాశ్చాత్య దేశాల్లో పర్యటించినప్పుడు వారి తృప్తి కోసరం మాంసాహారాన్ని కూడా తిన్నారు.

ఆయన్ని ఎంత కొత్త వాళ్ళు చూచినా ఒక అపరిచితుడ్ని చూచినట్లనిపించదు. తమకు బాగా తెలిసిన వాడని, రోజూ చూచే వాడేనని అనిపిస్తుంది. ప్రతి చిన్న విషయాన్ని ఎంతో ఆసక్తిగా తీసుకొని సంభాషిస్తారు. మొదటి చూపులోనే ఏదో భావోద్రేకం కలుగుతుంది. ఆయన ఆజానుబాహుడు 5'-6" ఎత్తు. పెద్దతల, కోటేరేశినట్లుండే ముక్కు గద్ద ముక్కులా వుంటుంది. బంగారు మేని ఛాయ. చూచేందుకు బలహీనంగా వుండి, కండలు తిరిగి వున్నట్లుండే వాళ్ళ

కారు. చాలా తెల్గ్గా తిప్ప గలిగిన ముఖం. చిరునగుమోము. అతి సామాన్య జీవనం. యివి ఆయన శారీరక వర్ణన.

బాహ్యాంగా ఆయన బలాఢ్యుడుగా కనపడ నప్పటికీ ఆయన శరీరం మాత్రం మనం వూహించలేనంతటివుక్కులా వుండేది. ఒక రోజు సాయంత్రం, ఆశ్రమంలో భజన పూర్తి కాగానే, కొందరు శిష్యుల్ని పిలిచి, తనకాళ్ళను, చేతుల్ని మర్దించమన్నారు. శిష్యుల్లో బాగా బలాఢ్యులైన 15మంది ఆయన శరీరాన్ని మర్దించడం మొదలెట్టారు. ఇంకాబలంగామర్దించమని ప్రోత్సాహ పరిచారు. దాదాపు 20 నిమిషాలపాటు పాపం వాళ్ళ శక్తి నంతా వుపయోగించి, విరామంలేకుండామర్దించే సరికి, అలిసి పోయి రొప్ప సాగారు. వళ్ళంతా చెమటలు కక్కాయి. బాబా మాత్రం చిరునవ్వు నవ్వుతూ వాళ్ళ బల హీనాన్ని వారు గుర్తించేట్లు చేశారు. అటువంటి ఉక్కు శరీరమాయనిది.

వినయమునభ్యసించుట గురించి బాబా చెబుతూ, భగవంతుని శాశ్వతంగా గుర్తుంచుకునేందు కదిఎంత అవసరమో చెప్పేవారు. "భగవంతుని పూర్తిగా మనల్ని మరిచి పోయేటట్లు చేసే మూడు గుణాల్ని మనం కలిగి వున్నాం. కామం, క్రోధం, కాంచనం అనేవే మూడు. ఇందులో, కామాన్ని, కాంచనాన్ని సులభంగా జయించ వచ్చు కానీ, క్రోధాన్ని జయించటం, చాలా కష్టం. యీ మూడింటిని జయించ గలిగిన వాడు సాధుపురుషుడు" అని చెపుతూ దీని సాధనకు వినయము ఎంతో అవసరమని చెప్పేవారు.

సదాశివ పాటిల్, డాక్టర్ అబ్దుల్ ఘనీ, పాద్రీ బైదిలు గుస్తాద్‌జీ వంటి శిష్యు లెందరో ఆయన పరివారంలో

అప్పటికే చేరారు. డా॥ ఘనీ మాత్రం, ఒక గురువుగా కాక తన బాల్య మిత్రుడు మేర్వాన్‌గానే కలిసేవాడు. ఆదీ కె. యిరానీ కూడ అప్పుడప్పుడూ బాబా దగ్గరకు వచ్చి వెడుతూ వుండేవాడు. 9-5-1922న వుపాశినీ మహారాజు జన్మ దినం వచ్చింది. యీ జన్మదినోత్సవాన్ని బాబా శిష్యులతో సకోరి వెళ్ళి స్వయంగా చాలా పెద్ద ఎత్తున జరిపించారు. యీ సందర్భంలోనే మహారాజు తన ఆధ్యాత్మిక ధనాగారానికి, మేర్వాను అధినాధుడని, తాళం చెవి యిప్పుడాయన వద్దేవున్న దని, ఆయన వల్ల ప్రపంచానికి ఏంతో మేలు కలుగుతుందని, ఆయన్నే అంటి పెట్టుకుని వుంటే, అచిరకాలంలోనే దైవ సాక్షాత్కారం కలుగుతుందనీ, బాబా శిష్యులతో చెపుతాడు.

దానితో శ్రోతల హృదయాల్లోని సంశోబాలన్నీ పటా పంచలయి పోయాయి. సాకోరానుంచి తిరిగి రాగానే బాబా కస్బాపేట కుటీరాన్ని ఎత్తి వేశారు. బొంబాయికి కాలి నడ కన వెళ్ళి అక్కడ మరో కొత్త ఆశ్రమాన్ని స్థాపించాలను కున్నారు. 23-5-1922వ తేదీన, వివిధ జాతులు, కులాలు మతాల వారున్న 40మంది శిష్యులు వెంటరాగా, బాబాజాన్ దర్శనాన్ని చేసుకొని తెల్లవారు ఝామున నాలుగు గంటలకు బయలు దేరారు. మే 27 నాటికి బొంబాయి చేరుకున్నారు. బొంబాయి దాదర్ రోడ్డులో 167 నంబరుగల పెద్ద మేడను అద్దెకు తీసుకుని, మంజిల్-ఎ-మీమ్ దానికి పేరు పెట్టి ప్రతి వారు విరాగిగా జీవితాన్ని సాగించడం మొదలెట్టారు. ఆధ్యా త్మిక జీవితానికి సిద్ధంగా వుండేటట్లు తయారు చేసేందుకు బాబా పర్యవేక్షణలో శ్రద్ధ వహించారు బాబా. ఏ మతానికి సంబంధించిన శిష్యులు, ఆ మతాచారాలు పాటించేపర్పాట్లు

చేశారు. రోజులు గడిచే కొద్దీ నిబంధనలు తీవ్రతరం చేసి, నియమాలు తు.చ. తప్పక పాటించే సాధన యిచ్చారు, చీకటితో లేవటం, చన్నీటిస్నానం, దైవధ్యానం చేయటం వంటివే కాక, ఏమీ చదవకూడదని, ఎరిగిన వారు కనపడ్డా పలకరించకూడదని, యిలా ఎన్నో కఠోర నియమాల్ని విధించి, వాళ్ళను అగ్ని పరీక్షలకు గురిచేసి, నిగ్గు తేల్చారు.

యింకా ఎన్నో నియమాల్ని వ్రాత మూలకంగా శిష్యులందరికి యిచ్చి, వాటిల్లో దేన్నైనా సరే, ఏ వక్కరు వుల్లంఘించినా, తానే శిక్షను స్వయంగా అనుభవిస్తానని చెప్పారు. నియమోల్లంఘన జరిగిన సందర్భంలో బాబా తన గదిలో తాళం వేసుకుని ఆహారం తినకుండా రోజులు తరబడి వుండి పోయే వారు. మంజిల్ నివాసంలో విధించిన నిబంధనలు తాత్కాలికంగా యిచ్చినట్లు కనపడినా, అవన్నీ తన యావత్తు మండలికి శాశ్వతంగా విధించినట్లే కనపడుతుంది. మధ్యమధ్య కుంటి వారిని, గుడ్డివారిని, కుష్టు రోగుల్ని మంజిల్ కి తీసుకు వచ్చి వారికి భోజనం పెట్టేవారు. బిచ్చగాండ్రకు స్నానం చేయించి, బట్టలు ధరింప చేసి, తానే స్వయంగా వడ్డించేవారు.

ఎవరైనా సరే స్వార్థాన్ని మరచి, సత్యమైన ఆత్మ తత్వాన్ని తెలుసుకో గలగాలంటే, ముందుగా వ్యక్తి గత ప్రాముఖ్యతని వదులుకో గలగాలి. తన ఔనత్యాన్నిగానీ, ఆధిక్యతనుగానీ గొప్పలు చెప్పుకోవటంకాక, ధూళిగా మారి పోవాలి. తాను నిర్వర్తించే పనులు చూచుకొని అహంపెంచుకోరాదు. ఎట్టి పరిస్థితుల్లోనూ, "ఇది నేను చేస్తున్నాను" అన్న భావం రాకూడదు. కోపం సుడిగాలిలాంటిది. ఇది

దీపం వంటి మనస్సును ఆర్పేస్తుంది. అందుకే అన్ని మానశిక చాంచల్యాల నుండి అతీతులుగా తీర్చి దిద్దేందుకు, శిష్యుల్ని క్రమశిక్షణలో వుంచారు. ప్రతి విషయంలోనూ, నియమబద్ధంగా తమ అమూల్యమైన కాలాన్ని వృధా చేయనీయక ఆచరించేట్లు నడిపించేవారు.

గురువాజ్ఞను శిష్యుడు పాటంచితీరాలన్నట్లు ఆచరింప చేశారు. ఆయన ఆజ్ఞలు ఎలా వుంటాయంటే, అనవసరమైన వాటిని, క్షణాల్లో తెమ్మనేవారు ఉదాహరణకి, అసహ్యంగా వుండే చోట, భోజనం తెచ్చి వడ్డించమనే వారు. రైలు కదులుతుందనగా, వెళ్ళి కప్పుడు వేడిపాలు తెమ్మనేవారు. అప్పుడు దిగితే రైలు వెళ్ళిపోతుందేమోనని శిష్యుడు ఆలోచిస్తూ కూర్చోక వెంటనే దిగి పాలకోసం పరుగెత్తాల్సిందే. ఇటువంటి సంఘటలెన్నో శిష్యులు అనుభవించారు, యిక్కడ మనం గమనించాల్సిందేమంటే, బాబా తన శిష్యులు ఆచరించేందుకు వీలులేని ఆజ్ఞలిచ్చేవారని అనుకోరాదు. మానశికంగా పరిణతి చెందేందుకది దోహదపడింది. 9/11/94

ఏరోజు ఏం జరుగుతుందో, తెలియని స్థితిలో శిష్యుల్ని వుంచి, తరచూ తన కార్యక్రమాల్ని మార్చివేసేవారు. ఇతరులకు, అజ్ఞలు జారీ చేసేటప్పుడు గానీ కార్యక్రమాలు నిర్వహించేటప్పుడు గానీ, బాబా సమయ నిష్ట పాటించేవారు. కాలహరణాన్ని సహించేవారుకారు. మానవునిగా ఆయన ఒక గురువేననుటలో సందేహం లేనట్లు మంజిల్ యిమామ్‌లో శిక్షణ కార్యక్రమాని నడిపించారు. ప్రతి దానికీ ఆయన గురువే ఏదీ వృధా కావటానికి వీలు

లేదు. ఆయన సముక్షంలో వుంటే చాలు వికశించిన హృదయంతో దర్శించేవారికి, వికశించే కనిపించేవారు. ఓ సూర్యునిలా, తేజస్సుతో వెలిగిపోతూ కనపడేవారు. ఆయన ఏమి ఆజ్ఞాపించినా అధికార స్వరం కనిపించేదికాదు. ఆజ్ఞలు జారీ చేసినట్లుండేవి కావు. వాటిలా వెంట్రుకవాశి కూడ వ్యక్తిగత ప్రాముఖ్యత వుండేడిదికాదు.

“నేను మీకు ప్రణమిల్లెదను. మిమ్ములను సేవించెదను” అన్న గీతా సూక్తి ననుసరించి, బాబా ఎట్టి పరిస్థితులలోనూ వునికి కతీతుడైన భగవంతుడుగా తన శూన్యత్వాన్ని చాటుతూ నమ్రతతో తన కార్యక్రమాన్ని సాగించారని చెప్పటానికి నిదర్శనం ఆయన చేసిన పేదల కార్యక్రమం. యీ కారణం చేతనే దరిద్ర నారాయణుల్ని ఆదరించకలిగారు ఆయన పేదల్ని, ముష్టివాళ్ళని, కుష్టురోగుల్ని పిలిచి వాళ్ళకు నమస్కరించ కలిగారంటే, వారిలో దాగి వున్న దైవత్వాన్ని చూడకలిగారన్నమాట. తాను సర్వోన్నతుడన్నని రుజువుచేయుటమే కాక, అధములలో అధముడ్ని కూడానని అచరణలో చేసి చూపారు. 10/11/94

ముఖ్యంగా మంజిల్-ఇ. మీమ్‌లో శిష్యరికం నెఱపిన శిష్యులంతా హెజరత్ బాబాజాన్ మీద, ఉపాశినీ మహారాజు మీద ఎంతో గౌరవం, నమ్మకం వున్నవారవటం విశేషం వారంతా గడిపిన మంజిల్ జీవితం గురించి వ్రాయాలంటే చేంతాడవుతుంది. ఏ ఒక్కరి జీవితంతో పోల్చటానికి వీలులేని విధంగా, ఎవరి మతాచారం ప్రకారం వారు, నియమ ప్రకారం, ఎవరు ఏ పనిని ఎప్పుడు ఎలా చేయాలో అప్పుడు అలా నడుచుకున్నారంటే, వారి మీద పరోక్షంగా

వుపాశినీ మహారాజు బాబాజాన్‌ల హెచ్చరికలు కూడా కొంతవరకు పనిచేశాయనటంలో తప్పులేదు. యీ ఇరువురు గురువులు కూడ, శిష్యులందరితోనూ, "మేర్వాన్ చెప్పినట్లు చేయండి. ప్రపంచమంతా ఆయన ఆడమన్నట్లు ఆడే సమయము వస్తుంది." అని చెప్పి పంపినవారే వీరంతా.

బాబా ఏ నియమాలు పెట్టినా, అవి శిష్యుల ఆరోగ్యం కోసరం నైతిక ప్రవర్తన కోసరం, ఆధ్యాత్మిక వికాశం కోసరమే, నిర్దేశించబడి వుండేవి. వారి ఆధ్యాత్మికాభివృద్ధికి మానశిక శిక్షణలో అధిక ప్రాధాన్యత నిచ్చారు. శిష్యులతో చాలా సార్లు, సాధువుల సమాధులకు, ఆటలకు, వినోదాలకు వనభోజనాలకు వెళ్ళేవారు. తద్వారా, శిష్యులు తనతో స్థిరమైన సంబంధం పెంచుకొనేట్లు వీలు కల్పించారు.

ప్రాపంచికపు పరిమితులు, తారతమ్యాలు దివ్యత్వపు మార్గంలో అడ్డు కట్టలవుతాయి. ఆధ్యాత్మిక విషయంలో, దివ్యత్వపు మార్గంపై, సాధకుడైన శిష్యుడు గురువుతో సంబంధం పెట్టుకోగలిగితే నిరంతరం, దానివలన ఉన్నతస్థితి పొందటానికి వీలవుతుంది. అందుకే బాబా "నా శిష్యులు నాతో ఇలాటి సంబంధం కలిగివుంటేనే, అనంతమైన పెన్నిధిని నా శిష్యమండలితో భవిష్యత్తులో నేను పంచుకొనేందుకు వీలవుతుంది." అని ఒకసారి రంజూతో చెబుతారు.

మంజిల్-ఇ-మామ్‌లో బాబా తన శిష్యులకు ప్రేమ మయ జీవనానికి, విధేయత సమర్పణల గురించి ఎంతో భోధించారు. వారిలోని అహంకారాన్ని, పెంకితనాన్ని పొగొట్టి పాదాక్రాంతులయ్యేట్లు చేశారు. మూఢాచారులను కర్తవ్యపరాయణులయ్యేట్లు చేసి, ఆచార వ్యవహారాలు

ఆధ్యాత్మిక సాధనకు అవరోధాలేకానీ, ఏ మాత్రం సహాక రించవని తెలుసుకోనేట్లు చేశారు. ఆయనతో జీవితం గడప టానికి, విధేయతని ముఖ్యంగా అలవాటు చేశారు.

సేవలో పరిపూర్ణత "మాస్టరీఇన్ సెర్విట్యూడ్" అనే ఆదర్శవాక్యాన్ని అమలులోకి తెచ్చేట్లు బాబా ప్రకటిం చింది యీ మంజిల్-ఇ-మామ్ లోనే. బాబా యొక్క మూల సూత్రానికీ వాక్యం గీటురాయి. "ప్రేమించి సేవించు" అనేది బాబా బావ్యం. ప్రేమలేనిదే ఎవరు సేవిం చినా దానికి పరిపూర్ణత కలగదు. శిష్యులకు తనయందున్న సాంగత్య ప్రభావము, సేవ, త్యాగాల వల్ల యిటువంటి ప్రేమ సంక్రమిస్తుందని చెప్పేవారు. ప్రేమికుడు భగవంతుని పొందాలని పరితపించే దానికంటే, ఎక్కువగా ప్రియతము డైన భగవంతుడు, తన ప్రేమికుని పొందాలని కాంక్షిస్తా డన్న రహస్యాన్ని ఎక్కువగా తన ప్రసంగాల్లో వివరించే వారా రోజుల్లో.

బాబా ఆ రోజుల్లో ఎక్కువగా నవ్వు పుట్టించే మాటలు చెప్పేవారు. హాస్యోక్తులతో సంబాషణ బహుచతురతతో వుండేది. బహిరంగ వుపన్యాసా లెప్పుడూ యివ్వ లేదు మంజిల్‌లో రోజు శిష్యులకు అధ్యాత్మిక విషయాల మీద, భగవత్సాక్షాత్కారం మీద గంభీరోపన్యాలెన్నో యిచ్చే వారు ప్రతి వుపన్యాసంలోనూ కథలెన్నో చేప్పేవారు. ఒక సారి స్వర్గ నరకాలు గురించి చెబుతూ తన చిన్న తనంలో జరిగిన ఒక చక్కని సంఘటనను వుపమానంగా చెపుతూ. స్వర్గం నరకం అనేవి కేవలం వూహల్లో వుండేవే కానీ, నిజానికి వాటి వునికంటూ లేదని చెబుతారు.

16/11/94

తన చిన్న తనంలో ఒక రోజున తన మిత్రులతో వాహ్యాళికి వెళుతున్న సమయంలో, దార్లో కొందరువ్యక్తులు తారసిల్లారు. వాళ్ళంతా బాగా తాగివున్నారు. తాగినమైకంలో మంచి హుషారుగా కబుర్లాడుకుంటున్నారు. అందులోనిఒకరు తన ఆనందావేశంలో పరవశుడై తాను సాక్షాత్తు స్వర్గంలో విహరిస్తున్నట్లు చెపుతాడు. అంతలోనే వాళ్ళంతా దారిలో ఒక మురికి కాలవ అడ్డురాగా తాగిన తిమ్మిరిలో దాన్నెలా దాటాలో తెలియక తికమక పడతారు. అది చిన్న మురికి కాలవే అయినా, తాగిన మైకంలో వాళ్ళకది మహా నదిలాకన పడింది. అంతకు మునుపు స్వర్గంలో విహరిస్తున్నాని చెప్పిన వ్యక్తి తక్కిన వారందరినీ వారిస్తూ ముందుగా తాను ఎగిరి దూకిం తర్వాత, ఒక్కొక్కరినీ దూకమని చెప్పి, అమాంతం ఒక్క కుదుపుతో ఎగురుతాడు. అలా ఎగిరి దూకడంతో కాలు మెలికపడి, తగిలిన ఎదురుదెబ్బకు విపరీతంగా బాధ పడతాడు. ఆ బాధలో "అబ్బా! యిప్పుడు నేను నరకంలోయమబాధను అనుభవిస్తున్నాను" అని విలపిస్తాడు. యీ విషయాన్ని వుపమానంగా తీసుకొని నిజానికి స్వర్గం నరకమనేవి యిలా మన వూహల్లో వుండేవే కానీ, వాటికి వునికంటూ లేవని చెప్పారు.

భగవంతుడ్నే ప్రధాన లక్ష్యంగా కావాలను కున్నప్పుడు అటువంటివాడు స్వర్గ నరకాలు రెండింటినీ ఒక్క మాదిరిగానే చూస్తాడు. స్వర్గలోకంలోనూ, నరక లోకంలోనూ కూడ తన ప్రియతముడ్నే కావాలను కున్నప్పుడు అయాలోకాల గురించికానీ, లేక వాటిలోని అప్సరసలు భానిసలుగురించికానీ చింతించరు. అంతర, బాహ్యస్థితులమధ్య

మానసికమైన తెర అడ్డు వుంటుంది. సద్గురు అనుగ్రహం పొంది అతః శుద్ధి కలిగేంతవరకూ దీని వల్ల స్వర్గ నరక అనుభూతులు పొందటం తప్పనిసరి. ఆధ్యాత్మిక జీవితంలో, మానవుడు మూడు దశలలో నుంచి ప్రయాణిస్తాడు. మొదటిది తీవ్రమైన ఉత్సాహం. రెండవది ఆశా భంగం. మూడవది దివ్యానందం ఒకదాని తర్వాత ఒకటిగా యీ మూడింటిని అధిగమించి తీరు గమ్యాన్ని చేరేందుకు శిష్యులకు తగు తర్ఫీదును, బాబా యీ శిక్షణా కాలంలో యిచ్చారు.

మొదట్లో మంజిల్-ఇ-మీమ్ భవనాన్ని ఒకసంవత్సరం అద్దెకు మాట్లాడు కున్నారు- కానీ యింకా రెండు నెలలు ఉందనగానే 1923 ఏప్రిల్ 19వ తేదీన బాబా యీ మకామును ఎత్తివేసి, కొద్దిమంది శిష్యులతో అహమద్ నగర్ బయలు దేరారు. చాలామందిని వారివారి యిళ్ళకు పంపి వేశారు. బాబా వెంట పదముగ్గురు శిష్యులు అనుసరించారు. అహ్మద్‌నగర్ నైజాం షాహి రాజుపాలనలో పేరెన్నిక గన్న ప్రధాన నగరం. బాబా శిష్యుల్లో ముఖ్యుడైన ఆదికె ఇరానీ గారిది పట్టణమే. ఆదీ గారింటికి ఖుస్రూక్వార్టర్స్ అని పేరు. ఆదీగారి తండ్రి బహదూర్ కైఖుస్రూ సరోష్ ఇరానీ తల్లి గుల్మాయి. యీమె ఉపాశినీ మహారాజు శిష్యురాలు. మహారాజు ద్వారానే మెహెర్ బాబా గురించి తెలుసుకొని చివరికి వారి కుటుంటం యావత్తు బాబా పరిధిలోకి వచ్చిన అదృష్టవంతులు. వీరిదొక సంపన్న కుటుంబం. జోరాష్ట్రియన్ మతాచార పరాయణులు. వీరు యిరాన్ నుండి వలసవచ్చి, నగరంలో స్థిరపడి, బ్రిటిష్ పటాలాలకు కావలసిన సరకులు సరఫరా చేసే వ్యాపారంలో క్రమంగా పైకివచ్చి బాగా

సంపాదించారు.

వీరికి నగరులో రెండు మూడిళ్ళున్నాయి. కొత్తగా నిర్మించిన ఖుస్రూ క్వార్టర్స్ ప్రక్కనే వున్న సరోష్ మంజిల్ మరో భవనం వుండేది. దీని ప్రక్కనే యిప్పుడు అహ్మద్ నగర్ బాబా సెంటరున్నది. యిప్పుడు మెహెర్ బాబాగా ప్రసిద్ధి చెందిన ఆరంగం సమీపంలోని మిలటిరీ క్యాంపుగా వాడిన ప్రదేశమంతా కొని స్వంతం చేసు కొని కాలక్రమేణా కైఖుస్రూ ధనార్జనతోపాటు, పేరు ప్రఖ్యాతులు గడించాడు. నలుగురి మన్ననలు పొంది రాజకీయంగా ప్రముఖ వ్యక్తి అయి,బహదూర్ కైఖుస్రూసరోష్ఇరానీగా ప్రసిద్ధి కెక్కాడు. అవతారుని అంతరంగిక కార్యదర్శిగా పనిచేసి, ఆయన సేవలో తను, మన, ధన సర్వస్వం త్యాగం చేసి తుది శ్వాస విడిచేవరకూ బాబా సేవలో కొంగు విడువని ధన్య జీవి ఆదికె. ఇరానీ వారి రెండవ కుమారుడు.

పెద్దకొడుకు రుస్తుం కైఖుస్రూ ఇరానీని ప్రథమంగా తల్లి గుల్మాయి. బాబాకు సమర్పించుకుంది. తన శిష్యుడు రుస్తుం వివాహాన్ని మెహెరా చెల్లెలు ఫ్రీనీతో జరిగేటట్లు బాబా ఆశీర్వదించారు. వారి వివాహం జరిగే సమయానికి బాబా బొంబాయిలోని మంజిల్-ఇ-మీమ్ ఆశ్రమాన్ని ఎత్తి వేసి, కొద్దిమంది శిష్యులతో అహ్మద్ నగరుకు చేరుకున్నారు వివాహం సందర్భంలో రుస్తుం బంధు వొకరుబాబానుగురించి చులకనగా మాట్లాడేసరికి, రుస్తుం తమాయించుకోలేక,అతడి మీద తిరగబడతాడు. సరోష్ మంజిల్లోనే విడిది వేసి వున్న బాబాకీవిషయం తెలిసి రుస్తుంని పిలిపించి, ఆ విధంగావుద్రేక పడినందుకు మందలించారు. "ఎన్నో కఠోర నియమాలు

పాటించి, క్రమశిక్షణ కలవడిన నీవిలా వుద్రేక పడటం అవిధేయత అవుతున్నది. నాకు విధేయులై గౌరవించే వారుఎంత సన్నిహితులో, నన్ను విమర్శించి, ద్వేషించేవారూ అంతే సన్నిహితులు. కనుక కేవలం నన్ను విమర్శించి నంత మాత్రంచేత, నీవు అతనిపై వుద్రేక పడటం, నీ అహంకారాన్ని సూచిస్తున్నది. కనుక నేను మీ యింట్లో వుండను. అని చెప్పి వెను వెంటనే సరోష్ మంజిల్‌ని, విడిచి, చేలకు అడ్డంగా నడుచుకుంటూ, స్టేషను వద్ద రోడ్డు ఎక్కి, ఆరంగాం వరకూ వెళ్ళి పోయారు 18/11/1974

ఆయన ముందు నడుస్తూ వెళుతుంటే, శిష్యులంతా అయోమయంగా ఆయన వెనకే బయలు దేరారు. అలానడుచు కుంటూ వెళుతున్న బాబా, యిప్పుడు మెహెరాబాద్‌లో ధునీ వున్నచోట వుండే ఒకి వేప చెట్టు క్రింద కూర్చుండి పోయారు. బాబా తన యిల్లు వదిలి వెళ్ళి పోయారని తెలిసిన తల్లి గుల్మాయి తల్లడిల్లి పోయింది. రుస్తుం వెళ్ళి బాబాను క్షమాపణ కోరి తిరిగి రమ్మని ప్రాధేయ పడ్డాడు. అతడెంత వేడినా ససేమిరా రాను పొమ్మన్నారు. ఇహ చెసేది లేక, రుస్తుం యింటికి వెళ్ళి తన మూట ముల్లె సర్దుకుని బాబాదగ్గరకు వచ్చేశాడు. పెళ్ళి చేసుకోకుండా వచ్చేసిన రుస్తుంని చూచి బాబా మౌనంగా వుండి పోయారు. "బాబా: ఆదిలో నేహాంస పాదుగా మారిన యీ పెళ్ళి నా కొద్దు. నేనీ పెళ్ళిచేసుకోను" అంటాడు రుస్తుం. బాబా అతడి నిర్ణయానికి ముగ్ధులై, సమాజంలో తనపై వచ్చిన అవిశ్వాసాన్ని ఎదిరించి, నిలబడినందుకు రుస్తుంని శ్లాఘిస్తూ, వూరడించి, పెళ్ళి సమయానికి వస్తానని

హామీ యిచ్చి, పెళ్ళి పర్వాట్లు చూచుకోమని మళ్ళీ యింటికి పంపించారు.

బాబా ఆ చోటు విడవకుండా అక్కడే వుండిపోవడంతో రుస్తుం తల్లి గుల్మాయి బాబాకు, తక్కిన శిష్యులకు కూడ భోజనాన్ని అరంగాం రోడ్డు దగ్గరకే పంపించింది. చీకట్లో వున్న బాబాకి, అరంగాం గ్రామస్తుడొకరు లాంతరు తెచ్చి పెట్టగా, ఆ వెలుతురులో భోజనం చేసిన తర్వాత బాబా అతడితో, నీవిప్పుడు లాంతరును ఎవరి కోసరం తెచ్చి వెలుగు చూపావో నీకు తెలియదు. అయితే దీని ఫలితంగా నీవు మాత్రం నీ జీవితమంతా వెలుగును కలిగివుంటావు సుమా! అని దీవిస్తారు. ఈ సమయంలోనే బాబా ఆదీజాతో సంప్రదించి, వారిదే అయిన, మెహెరాబాదు ఆస్తినంతా ఖాన్ సాహెబ్ గారి నుండి స్వీకరిస్తారు.

ఇలా యీ ఆస్థిని స్వీకరించటంలో అయన కెందుకీ స్థళం నచ్చిందో మనం తెలుసుకోవాలి. అక్కడున్న ప్రశాంత వాతావరణం, వీచే చల్లని గాలి, లేక నూతిలోని తియ్యని నీరు నచ్చి అలా చేశారా అంటే అదేమీ కాదు. ఆయనేది చేసినా దివ్యదృష్టితో చూచి చేస్తారు. దీనికి సమీపంగా యిరువురు మహాత్ములు అంతకు ముందే, యీ స్థళ మహాత్మ్యం తెలుసుకొని తమ శాశ్వత ఆరామక్షేత్రంగా దాన్ని ఎంచుకున్నారు బువాజీబువా అనే మహర్షి అరం గాంలో విఠోభా గుడి వద్ద సజీవ సమాధి పొందాడు. అరంగాం గ్రామాన్ని చిన్న పండరి అని కూడ అంటారు.

అహ్మద్ నగర్‌లో షంసుద్దీన్ చిష్టి అనే ముసల్మాన్

సంత్ ఒకడుండేవారు. యితడ్నా నగరవాసులు ప్రేమతో మేలానా బాబా అని పిలిచే వారు. ఆయన ఏకాంత జీవితాన్ని ఎక్కువగా గడిపేవారు. ప్రజాజీవితానికి దూరంగా, వంటరిగా జీవించారు. ఆయనెప్పుడూ పారితోషికాలు పుచ్చుకొనే వాడుకాడు. అనుచరులంటూ ఎవరూ లేరు. కనీసం నగరంలోని వారికి కూడ పరిచయం లేకుండా వుండేవారు. చాలా కొద్దిమందికి మాత్రమే ఆయన గురించి తెలుసు. ఆధ్యాత్మిక వారసత్వ పరంపరలో యితడొక ఏజంటై వుండవచ్చు. యీ పుడమిపై సర్వకాల సర్వావస్తల్లోనూ ఇటువంటి సంబంధం కొనసాగుతూనే వుంటుంది.

ఈ యోగి గురించి అద్భుతకథ ఒకటి వుంది. ఇతడు అమ్మద్ నగర్ రాకముందు, లండన్ విక్టోరియా మహారాణి దగ్గర వంటశాలలో వంటవానిగా వుద్యోగం సంపాదించడంతో కష్టంమీద. గ్రేట్ బ్రిటన్ రవి అస్తమించని సామ్రాజ్యమనే పేరు గడించింది. ఇదే భావాన్ని యితర దేశాధినేతలు సైతం గుర్తించేందుకు, వీలుగా రాణి ఎందరెందరో దేశాధిపతుల్ని ఆహ్వానించి విందులు, అతిధి సత్కారాలు సలిపేది. అందమైన భారతీయుల్ని నియమించి, రుచికరమైన భారతీయ వంటకాలతో భోజనం పెట్టించేది. ఆ వంటకాలన్నీ ఎంతో రుచికరంగా యీ యోగి వండేవాడు. దాదాపు ఇరవై ఏళ్ళపాటు అలా వంటవానిగా ఆ యోగి అక్కడవున్న అధ్యాత్మికంగా ఏమిచేశాడో తెలియదు కానీ. ఒకనాడు తన వుద్యోగం విరమించి స్వదేశం వెళ్ళిపోవాలనుకుంటున్నానని రాణికి చెప్పుకున్నాడు. అతనికోరిక విన్న రాణి ఆశ్చర్యపడింది. మహారాణి దగ్గర సేవ వదులుకొనేందుకెవరూ అంగీక

రించారు. అయినా యితను వదులుకొని వెళ్ళిపోవాలని చెప్పే సరికి, రాణికి అటువంటి మంచి వ్యక్తిని వదులుకోవాలని పించలేదు. 23/11/1994.

వుద్యోగం మానవద్దని, తన శేష జీవితాన్ని తన వద్దే వుండి గడపమని అడిగింది. యింక ఎక్కువ జీతం యిచ్చి సకల సదుపాయాలు అధికంగా కల్పిస్తానని చెప్పింది. అయిన అతడంగీకరించలేదు. గత్యంతరం లేక అతని మీద అభిమానంతో రాణి సంచీ నిండా, లక్షల డాలర్లు విలువచేసే బంగారు నాణాలు వుంచి బహుమానంగా యిచ్చింది. అయితే ఆమె ప్రేమకు గుర్తుగా, అందులో కొంత మాత్రమే తీసుకొని తక్కినదంతా సమీపంలోని నదిలో గిరాటేస్తాడు. భారతదేశానికి వచ్చాక అహ్మద్ నగర్‌లో స్థిర నివాసం ఏర్పాటు చేసుకున్నాడు.

మునుముందు మెహెరాబాదు ఎంతటి జగత్ప్రసిద్ధి చెందనున్నదో ఆస్థళ ప్రాశస్త్యాన్ని గురించి ప్రకటించిన మహాపురుషుడీయనే. ఒకసారి అరంగాం వైపు తన అనుచరులతో షికారుగా వచ్చాడు అది 1922 ప్రాంతం. అరంగాం యింకా రెండు మూడు ఫర్లాంగుల దూరం వుండ నగానే, యిప్పుడు మెహెరాబాదు ఆశ్రమంలోని భావికి సమీపంలో ఆగిపోయాడు. దానికి చుట్టుపక్కల అటూయిటూ తిరిగి నూతికి 75 గజాల దూరంగా, దుమ్ములో దీర్ఘచతురస్రంగా తన చేతి కర్రతో గీతలు గీచి, తన శరీర త్యాగానంతరం ఆ అవశేషాన్ని ఆ గీతల నడుమ ఖననం చేస్తే తానెంతో సంతోషిస్తానని చెపుతాడు. అందు కాయన శిష్యులు, యిదివట్టి వూసరక్షేత్రం జన సంచారం లేని

చోటు, ఇంత దూరం, అయనకు శ్రద్ధాంజలి ఘటించేందుకు కెవరూ రారు. కనుక వూరికి దూరంగా యింత దూరంలో ఎందుకు సమాధి కావాలని నిశ్చయించుకున్నారని అడిగారు.

అందుకా యోగి, "మీరు పొరబడుతున్నారు. యీ చోటు, మునుముందు మహా దివ్యక్షేత్రమై లక్షలాది భక్తుల్ని మక్కువతో అలరింపచేసే జగత్ప్రసిద్ధి పొంద నున్నది. ఒక గొప్ప మహాత్ముడు, యిక్కడకు వచ్చి తన యింద్రప్రస్థాన్ని నిర్మించనున్నాడు. అప్పుడు మీరీ స్థళ మహాత్మ్యాన్ని తెలుసుకొని అర్థం చేసుకోగలుగుతారు" అని చెపుతాడు. కొద్ది రోజుల్లోనే ఆ మేరాబాబా మరణించడం ఆయన కొర్కె ప్రకారం, ఆయన చూపిన చోటే, ఖననం చేయటం జరిగింది. ఇది జరిగిన రెండు సంవత్సారాలకి, 1923 చివర్లో మెహెర్‌బాబా తన కేంద్రాన్ని బహిరంగ కార్యక్రమాలకై యిక్కడే స్థాపించారు. యీ స్థళమే మేహర్‌బాదుగా జగత్ప్రసిద్ధి చెందింది.

మెహరాబాదులో ఆశ్రమాన్ని స్థాపించిం తర్వాత 11 వ రోజునే భారత పర్యటనకు బయలుదేరారు. అంతే కాదు బాబా శిష్యుల్ని వెంటబెట్టుకొని అనేక ప్రయాణాలు దేశమంతా చేశారు. ఢిల్లీ, కరాచీ, క్వెట్టా, (బెలూచిస్థాన్) కాశ్మీర్, పెర్షియా, మున్నగు ప్రదేశాలెన్నో సందర్శించిన ఘట్టాలు చెప్పుకోదగినవి. బాబా కార్యక్రమాలలో నిరంతరం అనుకొని మార్పులు జరుగుతూ, ఏ రోజు ఎక్కడికి వెళతామో తెలియని అనిశ్చిత స్థితిలో శిష్యులు గడిపే వారు, దాదాపు నాలుగు నెలల పాటు పర్యాటన జరిపి చివరకు మళ్ళీ అంతా మెహెరాబాదు చేరుకున్నారు.

శిష్యులందరికీ కఠినమైన శిక్షణ యివ్వడం మొదలు పెట్టారు. శిష్యులు నియమోల్లంఘన చేస్తే అందుకు శిక్షగా బాబా స్వయంగా, నియమోల్లంఘన చేసిన శిష్యుని చేతికి బెత్త మొకటి ఇచ్చి దానితో అతని చేత దెబ్బలు తినేవారు. ఆశ్రమ స్థాపనలో శిష్యులతో రోజుకు 8 గంటలు పనిచేయించారు. కొన్ని పాత కట్టడాలు తీసి వేయడం, కొన్నిటిని మరమ్మతు చేయడం పాటిని చేరేందుకు పొలాల్లోంచి రోడ్లు వేయడం వంటి శారీరక శ్రమతో కూడిన పనుల్లో శిష్యులంతా తలమునకలై పని చేశేవారు. గమేలాలు మోసి కష్ట పడిన యీ కాలాన్ని గమేలా యోగాభ్యాస కాలమనిచెప్ప వచ్చును.

ఐశ్వర్యం భోగభాగ్యాలతో తుల తూగే వారిని సైతం, భౌతిక సంపదలకు అతీతుల్ని చేసేందుకు, వారు ఈ ఆనంత విశ్వంలో, దాని మాయలో లీనమై యున్నా, బాహ్య విషయాలపై తమ స్పష్టిని కేంద్రీకరించ కుండా సదా ప్రభు నామస్మరణలో గడప గలిగేందుకు తగు తర్ఫీదు యీ గమేలా యోగాభ్యాస కాలంలో శిష్యులకు యివ్వ బడింది. ఆధ్యాత్మికతకు, భౌతికమునకు పొంతన కుదరదు. అయితే యీ రెంటిమధ్య ప్రాథమిక బంధం మనమనస్సులో చెలరేగే భావాల వల్ల పొంతన ఏర్పడుతుంది. మరి కేవలం ఆధ్యాత్మిక భావాలు ఆచరణలో పెట్టకుండా కలిగియున్నంత మాత్రం చేత ఒరిగేదేమీ లేదు. పై పెచ్చు అలాచేస్తే ఆధ్యాత్మికని వెచ్చించి భౌతిక మూల్యాన్ని సాధించటమే అవుతుంది. స్వలాభంతో చేసేటటువంటి సాధన యదార్ధ సాధన కాబోదు. అందుకే బాబా శిక్షణలో శిష్యులు

యీ సమస్యకు సమాధానం లేకుండా ఓడించేట్లు చేయ గల సమర్థులు కా గలిగారు. స్వలాభాన్ని పారద్రోలి, మానసిక చాంచాల్యాలకు లోను కాకుండా వుండే శక్తిని, యీ శరీరానికి, ఆత్మకు, వాటిని ఎదుర్కొనుటకు అపూరమగు సామర్ధ్యాన్ని తన శిక్షణ ద్వారా బాబాయే వారి కదించారు.

ప్రాపంచిక జీవితం గడుపుతూ, విద్యుక్త ధర్మాలాచరించి, రోజుమొత్తంలో ఏ కొద్ది క్షణాలన్నా యీ జీవితాని కతీతమైన అనంతుని గురించి ఆలోచించ కలిగితే, కాలక్రమేణ, యిటువంటి చింతన, భౌతిక ఫలితాల్నుండి విడివడి, స్వేచ్ఛను కలిగిస్తుంది. అజ్ఞానంలో వున్న మనం, యీ సత్యాన్ని తెలుసుకోలేకున్నాం. విషయవాంఛల్లో మునిగి, శరీర భ్రాంతి, మనోభావాలు యివన్నీ అవిద్య అనే ముసుగులో చుట్ట బడటం వల్ల, మాయయొక్క ప్రభావానికిలోనై దానికి చేదోడుగా మన మనస్సు పని చేయుట చేత యదార్ధ సత్యాన్ని మనం గ్రహించలేకున్నాం. బహుళార్ధకమైనయీ జగత్తు మిధ్య. అది ఏ కైకునికి చెందినప్పటికీ, తన వునికిని బట్టి వేరన్నట్లు కనపడుతోంది. 28/11/97.

భగవంతునికీ, జగత్తుకి మధ్య వుండే సంబంధం, మట్టికి కుండలకు మధ్య వుండే సంబంధంవంటిది. బంగారానికి నగలకు మధ్య వుండే సంబందం లాంటిది. అలలకూసముద్రానికీ మధ్య వుండే సంబంధం వంటిది. అలలు సముద్రంలో కలిసినప్పుడు, సముద్ర జలమే అవుతాయి కానీ భిన్నమైనవి కావు. అలాగే మట్టి పాత్రలు, బంగారు ఆభరణాలు. మట్టికి బంగారానికి భిన్నమైనవి కాబోవు. వాటిని తయారు చేయడానికి వాడింది మట్టి బంగారమే కదా! పేరు రూపం తప్ప

వాటిలో యదార్ధ స్థితి లేదు. వాటిని చెడగొడితే రూపం పోతుంది. పేరు పోతుంది. వాటి ఉనికినే కోల్పోతుంది మట్టి పాత్రలో పాత్ర అనేది పేరుకే కానీ అందులో వుండేది మట్టి యిది సత్యం. మట్టి అనే సత్యము నేనే. నేనే ఆ బంగారాన్ని నేనే ఆ సముద్ర జలాన్ని అన్న జ్ఞానాన్ని వారికి ఆచరణ ద్వారా మేలుకొలుపు కలిగించి తెర తొలగించేట్లు చేశారు.

దైవ ప్రేమలేకుండా ప్రాపంచిక వ్యవహారాల్లో దిగితే యింకా యింకా అందులో కూరుకు పోతాం. ఫలితంగా ఎన్నో ప్రమాదాలు, దుఃఖాలు, బాధలు ఎదుర్కోవాలి. వాటి గురించి ఎంతగా ఆలోచిస్తే అంతగా వాటిల్లోఅతుక్కు పోతాం. పనస పండు కోయాలంటే ముందుగా చేతులుకు చమురు రాసుకోవాలి. లేక పోతే దాని పాల జిగురు చేతుల కంటుకుంటుంది. అలాగే దైవ ప్రేమ అనేచమురుముందుగా సంపాదించి, చేతులకు పులుము కోవాలి. ఆ తర్వాత ప్రాపం చిక ధర్మాలు నిర్వర్తించినా అవి అంటు కోవు. అయితేయిటు వంటి దైవ ప్రేమ అనే చముడు సాధించేందుకు సాధన కావాలి.

పాలనుండి వెన్న తీయాలంటే, పాలుకాచి,కుండలో తోడు పోసి, కదలకుండా భద్రంగా వుంచి, అ తర్వాత చిలి కితేనే వెన్న వస్తుంది. పాలగిన్నె కదిపితే పాలు తోడుకోవు. పెరుగు కాదు. అందుకే నూతన శిష్యుల్ని తమ విధి నిర్వ హణలో మనస్సు చెదిరి పోనీయక, ప్రశాంతంగా వుంచుతూ, ఏకాగ్రతతో దైవంపై లగ్నం చేయకలిగేటట్లు తర్ఫీదు నిచ్చారు. ప్రపంచం నీరు వంటిది. మనస్సు పాల వంటిది పాలను నీళ్ళల్లో పోశామో అవి రెండూ కలిసి పోతాయి

కదా! పాలు నీళ్ళు విడదీయలేము. అందుకే పాలను పెరుగుగా మార్చి, చిలికి, వెన్న తీసి, ఆ వెన్నను నీటిలో వేస్తే తేలుతుందే కాని, మునగదన్న సత్యాన్ని ఆచరణాత్మకంగా శిష్యులు తెలుసుకో గలిగారు. 29/11/1994

మొదటినించీ, బాబా తాను గురువుని కానని చెప్పేవారు. ఇతరులని తమ గమ్యం చేర్చటమే తన పని అని చెప్పేవారు. అందరితో కలసి మెలసి, అందరి కోసరం, యీ ప్రపంచంలో జీవించటం కోసరమే తాను వచ్చానని, ప్రపంచం కోసరం రాలేదని చెప్పేవారు. ఆయన సద్గురువే కాదు. తానే స్వయంగా అవతారునిగా, దైవమానవునిగా ప్రకటించుకున్నారు. దైవత్వంతో కూడిన ధైర్యముంటేనే కానీ అలా ప్రకటించే ధైర్యముండదు. ఎటువంటి వుద్రేకాలకుతావు లేని రీతిలో, స్వార్థరహిత చింతనతో గడిపే జీవితంలో వుట్టిపడేది పరిశుద్ధ ప్రేమ. ఇదే దైవ ప్రేమ అవుతుంది. మహిమలు చేయటం, అద్భుత శక్తులు చూపటం వంటివి వట్టి విలువలేనివే కాని, పరిశుద్ధ ప్రేమకు తార్కాణం కాబోవు.

దైవత్వంతో కూడిన సందేశం యిస్తేనే కానీ, మన కళ్ళతో మనం దైవమానవుడ్ని గుర్తించలేము. ఆయనకు సన్నిహితంగా వున్నా ఆయనలా ప్రకటించక పోతే మనమాయన్ని తెలుసుకోలేము. బాహ్యంగా ఆయన శిష్యుల్తో కలసిమెలసి పెద్దన్నయ్యలా వ్యవహరించినా ఆయనే దైవమన్న ఎరుక వారి అంతరాళాల్లో తెలుసుకోగలిగేట్లు వారికిచ్చే శిక్షణ ద్వారా చేశారు. సద్గురువులో పరిపూర్ణత్వం శూన్యత్వమువలన తెలుస్తుందేకాని శక్తుల ప్రదర్శన వలన తెలియదు. బాబా తన దైవత్వాన్ని అవతారుని ప్రకటించి

నప్పుడు, "నన్ను దైవంగా సేవించండి. నాకు ప్రణమిల్లండి", అని చెప్పలేదు. "మిమ్మల్ని సేవిస్తాను. మీకు ప్రణమిల్లుతాను" అని చెప్పటమే కాక చేసి చూపారు. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆయన కడు నమ్రతతో వుండేవారు. ఏకాంత జీవితం సాగించి, "అనుమానించకండి. నేను సనతనుడ్ని అవతారుడిగా అవతరించిన దైవ మానవుడ్ని. నేను మీరు చూస్తున్న యీ శరీరాన్ని కాను. ఇది నేను మిమ్మల్ని చూచేందుకు వచ్చునప్పుడు ధరించే దుస్తు మాత్రమే. నేను అనంత చైతన్య శక్తిని. నేను మీ అందరితో కూర్చుంటాను. నవ్వుతాను. ఆడుతాను. పాడుతాను. అయితే అదే సందర్భంలో, ఉనికిలోని అన్ని భూమికల్లోనూ పనిచేస్తాను" అని చెప్పారు.

తన శిష్యులకు పరిపూర్ణ శిక్షణాకాలం సమాప్తము కాగానే తదుపరి ఘట్టంగా మెహరాబాదులో మరో క్రొత్త కార్యక్రమాన్ని ఆరంభించారు. దీనిలోని భాగమే ఉచిత బాలుర పాఠశాల ఏర్పాటు. జీవితంలో ఆధ్యాత్మిక విలువల్ని ఏవిధంగా జీర్ణించుకోవాలో యీ పాఠశాలలో బోధించబడేవి. దీనికితోడు, వుచిత వైద్యశాల, ధర్మశాల, పేద కాందిశీకులకు విహారారామం నెలకొల్పబడినాయి. పాఠశాలలకు హజరత్ బాబా జాన్ స్కూలు అని పేరు పెట్టారు. ధర్మశాలకు ప్రేమాశ్రమం అనిపేరు. ఇందులో బాబా మస్తులతో, పిచ్చివారితో తన కార్యక్రమాన్ని నడిపించారు. యీ ప్రేమాశ్రమం మొదట్లో ఎలా ప్రారంభమయిందో తెలుసా?

ఒక రోజున యిద్దరు పేదపిల్లలు 'అమ్మా! మాధా కవళం" అంటూ అన్నార్తులై రాగా, వాళ్ళకు బాబా అన్నాన్ని పెట్టించడమే కాక, తన ఆశ్రమంలో చేర్చుకు న్నారు. అప్పట్నుంచి, పేదపిల్లలెవరు వచ్చినా వుచితంగా అన్నం పెట్టబడునని ప్రకటించారు. ఆ ప్రకటన తెలుసు కొని, క్రమంగా వచ్చే పేదపిల్లలు సంఖ్య పెరిగింది. మర్నాటికి నలుగురు, ఆపైన యింకా పెరుగుతూ వారమ య్యేసరికి అయిదువందలమందయ్యారు. వీళ్ళందరితో బాబా, "ప్రేమాశ్రమం" అన్న పేరుతో చిన్నపిల్లలాశ్రమాన్ని నెల కొల్పారు. వీరికి వండిపెట్టడం, వారి మంచి చెడులు చూచే బాధ్యతను నజాకు వప్పగించారు.

ప్రేమాశ్రమం దినాభివృద్ధి చెందటంతో, హజరత్ బాబా జాన్ స్కూలు పేరుతో ఒక పాఠశాలను ప్రారంభిం చారు పాద్రి అనే శిష్యుడు మొదట్లో ఉపాధ్యాయుడుగా పనిచేసినా చివరి కాయనే యీ పాఠశాలకు ప్రిన్సిపాలుగా వ్యవహరించారు. అబ్దుల్లా, అలోబా వంటి వారు తమ చిన్న తనంలో యీ స్కూల్లో విద్యార్థులుగా చేరి బాబా ప్రేమలో మునిగిపోయిన ధన్యజీవులు. ప్రపంచంలో అన్నిటి కన్నా అసాధ్యమైన విషయం, ఆధ్యాత్మిక మనస్సు కలిగి వుండుటమని చెప్పుకున్నాం కదా! అటువంటి మనస్సు కలిగి వుండేందుకీ పాఠశాలను తీర్చిదిద్దారు. వ్యక్తుల మధ్య తర తమ భేదం లేకుండా, గురువు యొక్క అంతర్గత ప్రేరణ వల్ల అంతా సాధారణ వ్యక్తిత్వంతో ఐక్యంగా కలిసిపోయే వారు. వివిధ కార్యక్రమాలు జరిపేందు కిది ఆధారమైంది. పేదల కోసర ధర్మాసుపత్రిని కట్టించారు. ఈ ఆసుపత్రి

నిర్మాణాన్ని శిష్యులే స్వయంగా చేపట్టారు. దానికి మెహెర్ ధర్మాసుపత్రి అని పేరుపెట్టి రుస్తుంజీతో ప్రారంభోత్సవం చేయించారు. డబ్బు తీసుకోకుండా మందులు ఉచితంగా ఇవ్వబడేవి. యోగ్యతకల వైద్యుడ్ని నియమించినా బాబా కూడ కొన్ని గంటలు ఆసుపత్రిలో పనిచేసేవాడు. అన్ని కులాలు, మతాలకు చెందిన కొన్ని వేలమందికి ఉచితంగా మందులు యిచ్చేవారు.

అతి త్వరలోనే మెహెరాబాదు చిన్న బస్తీగా మారి పోయింది. తరుచుగా ప్రాక్పశ్చిమ శిష్యులు పెరిగిపోయారు. మెహెర్ బాబా మాత్రం అతిసామాన్య జీవితాన్ని గడిపారు. వివాహం చేసుకోలేదు. అవతారుడు చేసే పనులు దురూహ్యములు. ఆయన కార్యక్రమాలు మానవమేధకు అంతు చిక్కదు. బ్రహ్మాండమైన కట్టడాలు నిర్మించటం, కొన్నాళ్ళు గడవగానే వాటిని నేలమట్టం చేయటం, మళ్ళీ వేరే వూళ్ళో మరో కట్టటంతో సరికొత్త ఆశ్రమాన్ని స్థాపించటం వంటివి ఆయన కార్యక్రమంలో భాగాలు. చూచేవాళ్ళకీసి వింతగా కనపడవచ్చునేమో గానీ, బాబా మాత్రం పరందాలతో పోల్చి చెప్పేవారు. భవన నిర్మాణానికి పరందా చాలా అవసరం. అయినా యింతటి అవసరం కలిగిన పరందాని, ఏవరూ భవన నిర్మాణం పూర్తయిం తర్వాత వుంచుకోరు. సమూలంగా నిర్మిస్తారు. బాబా చేసింది కూడ అదే.

భగవంతుని యందు ప్రేమ లేనివానికి విషయభోగములందు ప్రేమ వుంటుంది. ప్రాపంచిక భోగములందు విరక్తి కలిగించి, విషయ వాంఛ కఠీతుడ్ని చేయటమే

ఆయన కార్యక్రమము. కీర్తిని కానీ ప్రతిష్టను గానీ కోరక, తనకు అత్యంత ప్రియతీతమని కోరేట్లు చేసేందుకే క్రొత్త ఘట్టం వుపయోగపడింది. మండు వేసవిలో ఎడారిలో ప్రయాణం చేసేవాడు దాహం వేస్తే మంచినీళ్ళడుగుతాడే కానీ, ముత్యాల్ని వజ్రాల్ని కోరడు. అలాగే భగవత్భక్తుడు ఈ సంసార దావానలానికి భయపడి భగవంతుడ్నే కోరతాడు. కానీ మరేది కోరడు. శిష్యులు అటువంటి ప్రేమ భక్తులుగా మారేందుకు కిది ఎంతో దోహదపడింది.

అంతే కాదు బాబా నిమ్న జాతులకు చెందిన అస్పృశ్యుల యోగక్షేమాలు ఎక్కువగా విచారించేవారు. పశుపక్ష్యాదు లందు భూతదయ చూపేవారు. అస్పృశ్యులైన బీద విద్యార్థులకు ప్రాధాన్యత యిచ్చి స్కూల్లో చేర్చుకొనేవారు. వాళ్ళ తలిదండ్రులకు అన్నదానం చేసే వారు. ప్రేమపిపాసులు, ప్రేమోన్మాదులు, ప్రేమికులనే గాక, గజ దొంగలపై కూడ బాబా తన కరుణాకటాక్షాలు ప్రసరించి, వారికి నూతన జీవితాన్ని ప్రసాదించారు.

ఒకనాడు అహ్మద్ నగరం జిల్లా అంతటా భీతావహాన్ని సృష్టించిన, 'సత్వర్ మాంగ్' అనే గజదొంగ బాబా ఆశ్వీర చనాలు కోరేందుకు కాయన దగ్గరకు వచ్చాడు. తన వృత్తిలో ఎటువంటి ఒడుదుడుకులు ఎదురవ్వకుండా విజయం పొందాలన్న కోరికతో బాబాను మహాత్మునిగా భావించి ఆయన ఆశీర్వచనం కోరాడు. అయితే బాబా అతడ్ని పిరికి పందగా చేతకాని ఆడుదానిగా మందలిస్తారు బాబా. కరుణ అతనిపై వుండటం చేత, మనోవైకల్యం చెంది, వచ్చిన పని

మరుస్తాడు. ఆయన కాళ్ళపైపడి, తానెలానడుచుకోవాలో చెప్పమని ప్రాధేయపడతాడు. భక్తితో భగవంతునిలో లీన మయ్యేందుకిది వుపయోగపడింది. నీటిమీద తేలుతూ యీదితే ఎక్కడో నట్టినడి సముద్రంలో అట్టడుగునున్న ముత్యాలెలా దొరుకుతాయి? భగవంతుడ్ని ముందుగా హృదయమందిరంలో ప్రతిష్టించాలి. పాడుబడ్డ దేవాలయంలో గబ్బిలాల్ని పారద్రోలి, దుమ్ముదులిపి, కడిగితేనే దేముడి విగ్రహాన్ని ప్రతిష్టించ వీలవుతుంది. ఏ విధమైన భక్తి భావం, ఆధ్యాత్మిక క్రమశిక్షణ లేని యీ గజదొంగలో సైతం హృదయ పరివర్తన తెప్పించి అతని హృదయ గహ్వారంలో దైవాన్ని ప్రతిష్టించారు.

తానిక ముందెలా జీవితాన్ని కొనసాగించాలో చెప్పమని సత్యార్ మాంగ్ అడిగినప్పుడు, "యీవానుంచి దొంగతనం చేయటం మానమని" ఆదేశించారు. అతడందుకు అంగీకరించినా, తనని ఎవరు నమ్మి చేరదీస్తారని చింతిస్తాడు. అప్పుడు కరుణామయుడైన బాబా గ్రామస్తుల్ని పిలిపించి, సత్యార్ మాంగ్ యీవానుండి దొంగతనాలుచేయడని, వృత్తి మానాడు కనుక, అతడ్ని గ్రామస్తులే పోషించాలని చెప్పారు. అందుకు వారంగీకరించి ఆ విధంగానే పోషించ సాగారు. కొన్నాళ్ళు అంతా సవ్యంగానే జరిగిపోయింది. కానీ ఒక రోజున మళ్ళీ తన పాత వృత్తిపై మనసు మరలి దొంగతనానికి వుపక్రమించాడు. అలా పరుల సొత్తుపై చేయి వేసేసరికి, బాబా రూపం వాడి కళ్ళముందు కనపడి తన చేయి పట్టుకున్న భావం కలుగుతుంది. దానితో సత్యార్ మాంగ్‌కి పూర్తి వైరాగ్యం కలిగి, తన అవిధేయతకు

పశ్చాత్తాప పడి, బాబా దగ్గరకు వెళ్ళి రెండు చెంపలూ వాయించుకొని క్షమాపణ కోరుకున్నాడు. అతడ్ని క్షమించడమేకాక, తన కరుణను ప్రసాదించారు. ఆత్మార్పణ బుద్ధితో గురువు యిచ్చిన ఆజ్ఞను పాటిస్తే పొందే లాభానికి యిది చక్కని తార్కాణం. 3/12/94

బాబా తరచు చెప్పేవారు. "ఏ మతాన్ని, ఆరాధనా విధానాన్ని గాని, ఒక పద్ధతి ప్రకారం నమ్మకాన్ని గాని, ప్రవేశ పెట్టుట నా వుద్దేశ్యము కాదు ఇటువంటి సంస్థలిప్పటికే ఎన్నో వున్నాయి. నిత్య జీవితంలో వారి ఆదర్శాలను తెలుసుకొని, ప్రజలకు సహాయపడేందుకు నేను వచ్చాను. పదార్థానికి, పరమార్థానికి మధ్య అంటే రూపానికినామానికి మధ్య మేలికమైన వ్యతిరేకత ఏదిలేదు. అజ్ఞానంవల్ల మీ ఆలోచనలు అటువంటి తప్పుడు అభిప్రాయాన్ని కలిగించి, నీవు వేరు, నేను వేరన్న భావాన్ని కలిగిస్తున్నాయి. బుద్ధి హృదయము, యీ రెండింటి సామరస్యం చేత, శాశ్వత జ్ఞానాన్ని పొందవచ్చును. ఈ జ్ఞానాన్నే నేను మీకివ్వదలచాను." అని ప్రకటించారు.

జీవితము యొక్క పరమావధి ఆధ్యాత్మిక సాధనము. మనము పొందవలసిన గమ్యస్థానము భగవంతునితో సమైక్యము. సాధారణమైన యోగ సాధనలు మంచి సంస్కారాల్ని కలిగిస్తాయి. కానీ ముక్తిని యివ్వలేవు. అందుకే మోక్షాన్ని కోరేవాడు, మంచి చెడ్డలతో కూడిన యీ అన్ని సంస్కారాల్ని తన కాతానుండి పూర్తిగా ఎత్తి వేయాలి. అద్దాన్ని నిర్మలంగా తుడిచి శుభ్రం చేస్తేనే కానీ, నీనిజరూపం సరిగ్గా చూడలేవు. అలా శుభ్రంగా తుడిచి వేయగల సమర్థత

ఒక్కసద్గురువుకేవుంటుంది. మానవునిలో వున్నఅనంతసంస్కా రాల్ని తొలగించ శక్యం కాని ఒక పెద్ద పెంట కుప్పతో పోల్చవచ్చు. శక్యం కాని దీన్ని ఒక క్షణంలో వినాశ మొనర్చి గలనని మెహెర్ బాబా అభయమిచ్చారు

అలా చేసేందు కాయున మనల్ని తనపేరునే ధ్యానించ మనలేదు. ఏ పేరు పెట్టి పిలిచినా పలుకుతానన్నాడు. నేనే రాముడ్ని, కృష్ణుడ్ని, బుద్ధుడ్ని, క్రీస్తుని, మహమ్మద్దుని అన్నారు. యిప్పుడు మెహెర్ బాబాగా మళ్ళీ మీ ముందుకు వచ్చాననన్నారు. ఆయనెంత దయాళుడంటే, సర్వకాలసర్వా వస్థలంను మీ యిష్ట దైవాన్ని స్మరణలో వుంచుకోమన్నాడు వ్యధ పడవద్దన్నాడు. సంతోషంగా వుండమన్నాడు. కోరి కలతో తన వద్దకు రావద్దన్నాడు. కేవలంమనసావాచాకర్మణా కొలిస్తే చాలన్నాడు. మన అవసరాలను తానే చూచుకుంటా నన్నాడు. రోజుకు 14సార్లు తారికు చూచుకొవి ఏదో ఒక సమయంలో "బాబా, బాబా" అనిస్మరిస్తేతృప్తిపడతానన్నాడు. చివరివరకూ బాబా కొంగు విడవకుండా వుండాలంటే ఆయన నామాన్ని వదలకుండా స్మరించడమే మార్గం.

ఆయన ప్రేమికుల ప్రేమకు బానిస ననేవారు. పరి శుద్ధమైన మనస్సుతో నూటికి నూరుపాళ్ళు నిజాయితీతో ఆయన్ని ధ్యానిస్తే, ప్రేమిస్తే, తాను అద్భుతాలు చేయక పోయినా, హృదయపూర్వకంవారేది కోరితే దాన్ని నేను వారికిస్తాను అని బాబా చెప్పారు. ఎదైనాసరే! ఆ కోరిక హృదయపు లోతుల్నుంచి రావాలి. నా ప్రేమను కోరేవారు నాకు యిష్టమైన వారన్నారు. ఆత్మసాక్షాత్కారానికిసుళువైన మార్గం, అవతారునికి ఆత్మార్పణ అవటమే. ఇక్కడ సమర్పణ

అంటే, ధనం, ఆస్తిపాస్తులు, సిరిసంపదలు ఆయనకు వదిలి వేయటం కాదు ప్రధానం."నేను"అనేఅహాన్ని అర్పణచేసుకో కలగాలి. అహంకార త్యాగం ప్రధానం. ఉన్నది బాబా ఒక్కరే. యీ బూటకమైన అహం లేనేలేదు. అది కేవలం మనము పొందే అనుభవం మాత్రమే బాబానేఅపినమంత్రాం గంలో మన కిటువంటిఅర్పణ భావం అలవడేట్లు, తానాచరించి మనమనుసరించేందు కనువైన జీవితాన్ని గడిపి, మనకు మార్గదర్శకులైనారు. 5/12/94

ఒక రోజున మెహెర్ బాబా తన శిష్యులతో 1925 జూలై 10నుండి ప్రారంభించిన మేనాన్ని కొన్నాళ్ళ పాటు పాటిస్తానని చెప్పినా, ఆనాటినుండి ప్రారంభించిన మేనాన్ని దిగ్విజయంగా దాదాపు 44సంవత్సరాలపాటు సంపూర్ణంగా పాటించారు. మేనంతోవున్నా యీ 44 సంవత్సరాల కాల ములో కూడా ఆయన ఎంతో చురుకుగా పని చేసేవారు. వ్యక్తులతో గానీ, బృదాలతో గానీ నిరాఘాదింగా మాట్లాడు తున్నట్లే సంచరించేవారు. పెదవిదాటి పలుకనేది రాకున్నా, ఆయనతో వున్నప్పుడు, ఏదో తెలియని వుత్తేజం కలిగేది. కొత్తదనమనిపించక, నిత్య సహచరుని కలిసినట్లుండేవి. చూచిన కొద్ది చూడాలనిపించేది. మేనానికి వ్రాయటం మాన టానికి ఏదైనా సంబంధం వున్నదేమో తెలియదు కానీ, వారెందుకు మానేశారో సరిగ్గా వివరించలేము. నిజానికి రెంటికీ ఎంతో విశిష్టత వుంది. ఆయన వివరంగా వివరించక పోవ టానికి కారణం, మేన మౌననానికి సమాదానంగా గుర్తిం చాలి.

మేనానికి ముందుమూడున్నరసంవత్సరాలప్రకితంతనకు

ముప్పయి ఒక్క సంవత్సరాల వయసున్నప్పుడు తననుతాను గుర్తించాడు. మాటల్తో అందించే బోధలెన్నిటినో యీ ప్రపంచం యింతకుముందు వినియున్నది. ఎందరో మహాత్ములు అవతరించి శాంతి దూతలుగా ధర్మబోధలు చేశారు కాలాను గుణ్యంగా ప్రవక్తలు తమ జీవితాలు గడిపి,తమ సందేశాల్ని మాత్రం మిగిల్చి గతించి పోయారు. అవన్నీ యిప్పుడు పెడ చెవిన పెట్టబడినయి. మానవులు ఆయా ప్రవక్తలపేర్లమీదుగా మతాల్ని, సాంప్రదాయాల్ని తయారు చేసి, యీ చిన్న భూఖండాన్ని భాగాలు పంచుకున్న యింటిలామారుస్తున్నారు. అణు విస్ఫోటకం మానవ వినాశానికి దారి తీస్తోంది. అల్ప కోరికలకు హక్కులు బలై, శాంతికి భంగం ఏర్పడింది.

తికమక పెట్టే మతమేధ్యపు కారు చీకట్లో తన గమ్యం చేరే మార్గం తెలుసుకోలేకపోతున్న మానవుడికి ఆశాకిరణంగా మెహెర్ బాబా రూపంలో భగవంతుడుఅరుదెంచాడు, ధర్మోప దేశాల వల్ల గాఢాంధకారం తొలిగి పోదు, మానసికంగా ప్రబలివున్న మతోన్మాదం, పోరాట తత్వం, సమసిపోయేట్లు చేసేందుకు శాంతి కాముకమైన స్వయంశక్తిగలఆత్మ యొక్క అవసర మేర్పడిన యీ తరుణంలో భగవంతుడు, మెహెర్ బాబా రూపంలో అవతరించాడు, ఆయనకు మాటలతో పని లేదు,"నా మేనమే మాట్లాడ లేనప్పుడు, పదముల వుపయోగ మేమున్నది?"అని ప్రశ్నించారాయన,"యధార్థానికి నేనేన్న డూ మేనంగా లేను, ప్రతివారి హృదయంలో శాశ్వతంగా మాట్లాడుతున్న శబ్దాన్ని నేనే" నన్నారు.

యావత్తు జగత్తు కాయన ఆశాజ్యోతి. ఇదెఅద్భుతమే

నావతారం. గార్డు బిగ్గరగా విజిల్ వూదినంత మాత్రం చేత రైలు యింజను కదలదు. రైలుని ముందుకు కదిలేట్లునడపా లంటే, డ్రైవరు, ఆవిరిశక్తిని వదలాలి. మానవుని మనస్సు, హృదయపు శక్తుల్ని కదిలించి నడిపే డ్రైవరుగా బాబా వచ్చారు. అనంత జ్ఞానమనేజ్యోతినిపట్టుకున్నసనాతుడాయన. కులాలు, మతాలు, కర్మ కాండలతో సతమతమవుతున్నఅధునాతన స్వార్ధ పరులలో, సనాతన ఆత్మచైతన్యాన్ని మేల్కొలిపేందుకు మాటలతో పనిలేదని ఆయన మౌనాన్ని పాటించినట్లు కనపడుతుంది.

మెహెర్ బాబా యొక్క మౌనాన్ని స్వీయమౌనంతోనే అర్ధం చేసుకోగలం. ఆయనలోని ప్రశాంతతని, మనమనస్సు యొక్క ప్రశాంతతని బట్టి మాత్రమే స్వీకరించ వచ్చును. నీ లోని "నేను-నాది" అన్న భావంపోతే గాని యిది అర్ధం కాదు. మౌనం శక్తిని పరిరక్షిస్తుంది అంతర్గత శాంతిని కాపాడుతుంది. నోటితో పాటించే మౌనం, చంచలంగా తిరిగేమనస్సును మౌనంగా వుండేట్లు చేస్తుంది, మౌనంవలన ఉద్రేకం రోజురోజుకు తగ్గుతుంది. అంతర్గత మౌనం వల్ల ఆత్మ మేల్కొంటుంది. మనస్సు పని చేయడం ఎప్పుడైతేమానటం జరుగుతుందో ఆ మరుక్షణంలోనే హృదయం తెరుచుకుంటుంది.

బాబా యొక్క మనస్సు లోకాతీత మౌనపుపరిశోధనాగారం. అది అంతర్జ్వాలను వెలిగిస్తుంది. ఆయనఅద్వితీయుడు నోటిని, ఆలోచనల్ని, కలాన్ని, అన్ని బాహ్య భావాల్ని మౌనంతోనే ఆపివేశారు. కోరికలన్నిటినీ విసర్జించారు. ఆ మౌనం నుండి వచ్చే విద్యుత్తే మనమనస్సును,హృదయాల్ని

ణాలు చేశారు. మస్తుల అన్వేషణలో ఆధ్యాత్మికంగా పురోగమించి పరిణతి చెందిన వారిని కలిసి, ఆధ్యాత్మికంగా ముందుకు సాగేందుకు సహాయ పడ్డారు.

కఠినమైన యీ మస్తు ప్రయాణాల్లో వేల కొలది మైళ్ళు, అన్ని రకాల సాధనములపైనా ప్రయాణం చేశారు. కారు, టాంగా, రైళ్ళు, ఎడ్లబళ్ళు, గుర్రం, గాడిదలు, ఒంటెలు మొదలగున్నవే కాక చివరకు కాలినడకనకూడ 75000 మైళ్ళు ప్రయాణాలు చేశారు. వీటితో సమానమైన మరో కార్యక్రమం, పేదలతోనూ, కుష్టు రోగులతోనూ చేసిన కార్యక్రమములు చాలా విలువైనవి. అవుసర సహాయమున్నమధ్యతరగతి కుటుంబాల వారు, హఠాత్తుగా సంభవించిన భారీ ఆపదల రీత్యానో, లేదా కరువులు, వరదలుమున్నగు ప్రకృతి వైపరీత్యాల వల్లనో అపారంగా నష్టపడి, సర్వం కోల్పోయి ఇతరుల్ని "దేహీ" అని చేయి చాచి, యాచించలేక, సిగ్గుతో రోజు గడవలేని స్థితిలో వున్న వ్యక్తుల్ని వెదికి కలుసుకొని ఆర్థికంగా సహాయ పడేవారు.

బాబా ధనాన్నెప్పుడూ స్పృశించలేదు. అవుసరమున్న వారికి సమర్పించునప్పుడు మాత్రం పైకాన్ని స్వహస్తాలతో యిచ్చేవారు. మన మామూలు భాషలో ఆయన వారికిధర్మం చేశారనటంకాదు-దాని అర్థం, ఆయన వారికి తద్వారాఆధ్యాత్మిక ఆశీర్వచనాల్ని ప్రధానం చేశారని చెప్పుకోవాలి. ఇలాంటి ప్రయాణాలన్నీ బాబా మారు వేషంలోనే చేశారు తన వెంట వుండే శిష్యులసైతం, ఆయన గుర్తింపును బయట పెట్టడానికి వీల్లేదని శాశించేవారు. ఈ విధంగా మారు వేషంలో బాబా భారతదేశంలో అన్నిప్రాంతాలుపర్యటిస్తూ

ఒక్కొక్కప్పుడు బహిరంగ ప్రజాదర్శనాలుకూడ యిచ్చారు. పాశ్చాత్య దేశాలెన్నో దాదాపు 13 సార్లు సందర్శించి, ఎందరెందరికో ఆయన అవతార తత్వాన్ని విశద పరిచారు. తన మొదటి పాశ్చాత్య పర్యటన 1931లో జరిగింది. అప్పుడే తన పాత పాశ్చాత్య ప్రేమికుల్ని కలిసారు. 13వది, చిట్టచివరిది అయిన విదేశీ ప్రయాణం 1958లో జరిగింది. తన అనుచరుల ఆహ్వానంపై యీ విదేశీ ప్రయాణాల్లో అనేక పర్యాయాలు. అమెరికా, ఇంగ్లాండు, ఇరాన్, ఆస్ట్రేలియా, ఐరోపా మున్నగు దేశాలు పర్యటించారు. 10/12/94

బాబా మౌనం ప్రారంభించ బోయే ముందే ఆఖరి సారిగా మాట్లాడిన మాటలు గుర్తుకు తెచ్చుకుందాం. యుగావతారుని ఆఖరు మాటలు విన్న ఆనాటి మండలి సభ్యు లెంతటి అదృష్టవంతులో మరి. "యిప్పుడు నేను నా గదికి వెళు తున్నాను. రేపటి నుండి నేను ఒకటిన్నర సంవత్సరములు వరకూ మాట్లాడను. మౌనంగా వుంటాను. మామూలుగా మీ జాగ్రత్తలో మీరుండండి. రాత్రిళ్ళు లాంతరు లేకుండా బయటకు రాకండి. పాములుంటాయి జాగ్రత్త. మీకే కష్టం వచ్చినా సహాయం చేస్తా కానీ పాము కరిస్తే నేనేమీ చేయను." అని చెప్పి తన ఝోంపడీకి వెళ్ళిపోయారు. ఆ మర్నాడు జూలై 10 శుక్రవారమైంది. ఆనాడు ప్రారంభించిన మౌనాన్ని తన పాంచ భౌతిక దేహాన్ని చాలించిన 1969 జనవరి 31 వతేది వరకు అజేయంగా పాటించారు.

మౌనం పాటించినప్పటి నుంచి, బాబా ప్రతిరోజూ గంటల తరబడి రహస్యంగా కూర్చొని ఒక మహా గ్రంథాన్ని

స్వయంగా రాశారు పెద్ద కొయ్యభోషాణం చేయించి, అందులో కూర్చొని తలుపు బిగించి, నియమ ప్రకారం రోజూ రచనను సాగించారు. రాత్రిపూట అంతా నిద్రపోయాక, ఆ నిశ్శబ్దనిశీధిలో ఏకాంతంగ కూర్చుని రాశిన ఆ పుస్త కంలో యింత వరకూ ప్రపంచానికి తెలియని ఆధ్యాత్మిక రహస్యాలెన్నో వున్నాయని, అది మానవాళికాయన అందిం చిన ఆధ్యాత్మిక సందేశమనీ విశ్వశించబడింది. వ్రాయటం పూర్తికాగానే దాన్ని భద్రపరిచి తాళం వేసి దాన్ని ఎవరూ చూడవద్దని ఆదేశించారు. తన శరీరత్యాగా నంతరమే దాన్ని ప్రచురించాలని ఆయన శాసించారు. యిప్పుడా వ్రాత ప్రతి ఎక్కడున్నదో తెలియదుకానీ, అమెరికాలోని ఒక బ్యాంకు లాకరులో భద్రపరచబడి వున్న దని, సమయం రాగానే యీ గుప్త గ్రంథప్రచురణ జరుగు తుందని మండలి ప్రముఖులు చెబుతున్నారు. సమయం వచ్చి నప్పుడల్లా బాబా దాన్ని బైబిలు అనే వారు.

యిలాగే మెహెరాబాదుతో మరో విషయం ముడి పడి వున్నది. అది 1925 వ సంవత్సరం సెప్టెంబరు 12 అప్పటి వరకూ, అది వర్షాకాలమే అయినా, వాన చినుకు పడలేదు. పంటలు మలమలా మాడిపోతున్నాయి. చుట్టుప్రక్కల గ్రామ ప్రజలు బాబా దగ్గరకు వచ్చి, వర్షాన్ని ప్రసాదించ మని వేడుకున్నారు. కరుణామయుడు కనుక, బాబా వారి మొర ఆలకించి, త్వరగా వారిని యిళ్ళకు వెళ్ళిపొమ్మని చెప్పి పంపేస్తారు. వారు వెళ్ళిన తరువాత, సాయంత్రం5గం॥ మండలి వారిని పిలిచి, రోడ్డు ప్రక్కనున్న వేప చెట్టు క్రింద ఒక అడుగు లోతున గొయ్యి తవ్వించారు. కొన్ని

కట్టెపుల్లలు, మంచి గంధపు చెక్కలు కొన్ని, కాస్తంత నెయ్యి తెప్పించి, వాటన్నిటిని ఆ గుండంలో వేసి, బాబాయే స్వయంగా జ్వాల వెలిగించారు. దీనినే బాబాధుని అని పిలిచారు.

పౌరాణికంగా కూడా యీ ధునికి ప్రత్యేకత వుంది. యిప్పుడైతే ప్రతినెల 12వ తేదిన మెహెరాబాదులో ధునీ వెలిగిస్తున్నారు. కానీ మన పూర్వకాలం రోజుల్లో యోగులు యీ ధునీనే హోమగుండముగా వ్యవహరించేవారు. భగవంతుని ప్రీతికరమైన నామాల్ని వుచ్ఛరిస్తూ, ధ్యాన సమాధిలో వుండి విషయ వాంఛలన్నిటినీ ఒక్కొక్కటిగా యీ హోమాగ్నికి ఆహుతి చేశేవారు. ధునీ అన్న పదానికి మూలం ధూన్ కావచ్చు. "ధూన్" అంటే దైవనామాన్ని ఉచ్ఛైస్వరంతో పలకటం. ధ్యానం చేసే వారి ప్రక్కనే వుండే అగ్నిగుండం కనుక దీనిమూలం "ధ్యాన్" అన్న పదం నుండి కూడ వచ్చివుండ వచ్చు. ఏమైతేనేం యీలా వెలిగించే అగ్నిగుండాకి ధునీ అన్న పేరు వచ్చింది.

యిలా ఆనాడు 1925 సెప్టెంబరు 12న బాబా ధునీ వెలిగించిన కాసేపటికి జ్వాల బాగా అంటుకొని మండు తున్నప్పుడు ఉపాశినీ మహారాజు హారతి పాట పాడించారు. ఒక అరగంట గడిచిందో లేదో మెల్లగా చినుకులు సాగి పెద్ద వర్షంగా మారి, కుంభ వర్షం కురిసింది. నూతులన్నీ నిండాయి. అది లగాయతూ ప్రతిరోజు నాలుగు గంటలు పాటు ధునీ వెలిగించేవారు. కొన్నాళ్ళు గడిచాక, ప్రతినెల 12వ తేదిన ధునీ తప్పక వెలిగించాలని బాబా ఆదేశించారు. ఆప్రకారమే యిప్పటికీ మండలివారు జరుపుతున్నారు.

బాబా మౌనం ప్రారంభించిన సంవత్సరానికి, దిగువ మెహరాబాదులో ఒక పెద్ద హాలుకట్టబడింది. దీన్నే సాయి దర్బారని యిప్పటికీ పిలుస్తున్నారు. రోడ్డుప్రక్క వేపచెట్టు క్రింద బాబా కూర్చోవడానికి ఒక అరుగు కట్టించారు. తర్వాత రోజుల్లో యీ అరుగే రాత్రింబవళ్ళు కూర్చోనే. స్థలమైంది. దీని పైనే ఒక ప్రక్కగా ధునీ కోసరం ఒక గుండాన్ని ఏర్పాటు చేశారు. మొదటి సారిగా యీ గుండములో 1925 నవంబరు 10 వ తేది రాత్రి 11 గంటలకు ధునీ వెలిగించారు. అప్పటికి చాలా కాలం నుండి వర్షాలు లేక కరువు వస్తుందేమోనన్న భయంతో వున్న సమయంలో యీ ధునీ వెలిగించిన ఒక గంట కాగానే పెద్దవర్షం కురిసి, దాదాపు 15 గంటలు పాటు ఏకధారగా కురిసింది.

మండలి వారిచేతనే ఆశ్రమంలో కావలసిన పనులన్నీ పురమాయించి చేయించేవారు. ఆస్పత్రిలో కాంపౌండరు, నర్సు, జమేదారు, కాపలాదారు, వంటవారు, మేనేజరు, స్టోరుకీపరు, గుమస్తా, విలేఖరి, సంగీతం పాడేవారు, మంగళి పనిచేసేవాడు మొదలగువారు చేయవలసిన పనులన్నీ మండలి వారికే పురమాయించేవారు. ఎవరి బట్టలు వారే వుతుక్కొనే వారు. ఆశ్రమ వ్యవహారాలు నిర్వహించటానికి ఒక కమిటిని వేశారు. ఈ కమిటీ కార్య నిర్వాక వర్గానికి అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, కార్యదర్శితో పాటు 16 మంది సభ్యు లున్నారు. మండలి వారినే యిద్దర్ని జమాను పనికి నియ మించారు. గంగారామ్ అనే మంగలి బాబాకి క్షౌరం చేసే వాడు.

11)

దగ్గర్లోని అరంగాం గ్రామ ప్రజలే కాక, చుట్టుప్రక్క లనేక గ్రామాల ప్రజలు బాబాకు ఆకర్షితులై నిత్యం వేల సంఖ్యలో ఆయన దర్శనార్థం రాదొడగారు. అర్ధరాత్రి దాక జనం వస్తూనే వుండేవారు. 1926 ఫిబ్రవరిలో బాబా జన్మదినం రోజున ఎన్నోవేల సంఖ్యలో జనం వచ్చేసరికి, మండలికి వారిని అదుపుచేయటం కష్టమైపోయింది. యీ జన్మదినం తర్వాత, జనాన్ని ఆయన దర్శనం చేసుకోనీయ లేదు. మెహరాబాదు వచ్చేందుకు ఆంక్షలు పెట్టడంతో సందర్శకుల సంఖ్య క్రమంగా తగ్గిపోయింది.

1926 అక్టోబరు నెలాఖరులో మెహరాబాదులోని నిర్మాణం చేసిన ప్రతిదీ కూల్చి వేయించారు. స్కూలు, ఆసుపత్రి, పోస్టాఫీసు, భోజనశాల, బాబా కుటీరం అన్నీ నేలమట్టం చేశారు. జీతాలిచ్చి పెట్టుకున్న వారందరినీ, నోటీసులు యిచ్చి మానిపించారు. పాఠశాల పిల్లలందరినీ వారి వారి తలిదండ్రులను పిలిపించి, వప్పగించారు. ఆయనతోనే వుంచదలచిన పిల్లల్ని అట్టేపెట్టుకున్నారు. ముందుగా పర్షియా దేశం వెళదామనుకున్నా, లోనామలా వెళ్ళి అక్కడ 10 రోజులున్నారు. తర్వాత బొంబాయి వెళ్ళి ఒక నెల గడిపాక మళ్ళీ డిశెంబరు నెలాఖరుకి అహ్మద్‌నగర్ చేరారు. మళ్ళీ బాలుర పాఠశాల మొదలు పెట్టారు. 23/12/25

మెహెరాబాదు కొండమీద బాబా అంతకు ముందు ఏకాంతవాసం చేసేవారు. ఆ చోటులో 1927లో ఆయన దగ్గరుండి ఒక గొయ్యి తవ్వించారు. దానికి నాలుగు వైపులా నాలుగు గోడలు కట్టించారు. ఒక వైపు దర్వాజా పెట్టి మూడు వైపులా కిటికీలు మార్చారు. మొదట్లో

పై కప్పుగా రేకులు బిగించినా, తర్వాత రోజుల్లో సిమెంటు కప్పు వేశారు. ఇదే ప్రియతమ బాబా యొక్క సమాధి స్థలం. దీనిలోనే ఆయన ప్రేమాశ్రమ బాలురకు ఏకాంతముగా గడిపే రోజుల్లో, కిటికీ గుండా తన అక్షర ఫలకముపై ఆధ్యాత్మిక వుపన్యాసాలెన్నో చేశారు. తాను ఎక్కడ భౌతిక శరీరత్యాగం చేసినా యీ సమాధిలో తన శరీరాన్ని నిక్షిప్తం చేయమని వీలునామా వ్రాసారు. చివరి కాయన ఆదేశానుసారమే వారి పాంచ భౌతిక శరీరము యీ సమాధిలోనే నిక్షిప్తం చేయబడింది.

మానవుల ఆధ్యాత్మిక లాభం కోసరం, ఆయన చేసే అంతరంగిక కార్యక్రమ కారణం చేత, మెహెర్ బాబా తరచు అధిక కాలము ఎకాంతంగా గడిపేవారు. అటువంటి సమయాల్లో ఆయన్ని ఎవరూ సందర్శించ కూడదు. 1965 నుండి కఠిన ఏకాంతవాసం లో వుండి, 1969లో ఆయన భౌతిక శరీరత్యాగం జరిగేంతవరకూ దాన్ని అవిచ్ఛిన్నంగా కొనసాగించారు. మన మెరిగిన ఏ శ్రేణికి చెందిన వారిలోనూ మెహెర్ బాబా యిమిడిలేరు. మాములు అనుభవాలు ఆయన గురించి చెప్పలేవు. ఆయన స్వంత విధానంలోనే ఆయన్నంగీకరించాలి. మాటలతో ఆయనకు పనిలేదు. ఆయన భోధించుటకు గానీ, లేదా కొత్త మతాన్ని స్థాపించుటకు గానీ, కాక, మానవుని మేల్కొలిపి, మనలో వున్న భగవంతుడైన నిజమైన ఆత్మను సాక్షాత్కరించుకోగల చైతన్యాన్ని కలిగించటమే ఆయన కార్యక్రమ ముఖ్య ఉద్దేశ్యమని బాబా చెప్పేవారు.

నేను భోధించుటకు రాలేదు. మేల్కొలుపుటకే

నారాక" అన్నారు. తన అనుచరులందర్నీ తమ తమ ఆచార వ్యవహారాల్ని, మత ధర్మానుసరం పాటించే స్వేచ్ఛను ఇచ్చారు. ఆయన ఏవిధమైన దీక్ష యివ్వలేదు. క్రమ శిక్షణ లాంటి వేవీ ప్రతిపాదించలేదు. పూజలు, జపాలు, మంత్రాలు, యోగాలు వంటివేవీ నిర్దేశించలేదు. నిజమైన యోగమంటే, "నీవు" పోవటమేనన్నారు బాబా. అనగా మనలోని అహంకారం, స్వార్థం నిర్మూలించబడాలన్నమాట. అందు కోసరమాయన "ప్రేమ" అనే సాధనాన్ని మాత్రమే నిర్దే శించారు. అయన నిస్వార్ధ ప్రేమ శక్తితో, యీ జీవిత లక్ష్యమేమిటో, దాని వుద్దేశ్యమేమిటో వివరంగా అర్ధమ య్యేట్లు జాగృతి కలిగించారు. 24/12/1994

ఆయన మనల్ని తన కొంగు గట్టిగా పట్టుకోమన్నా రంటే, మనల్ని యింకా పసి పిల్లలుగా మారాలని చెప్పారన్న మాట. అది మనల్ని ఎక్కువగా ఆయన మీద ఆధార పడేట్లు చేస్తుంది. మన జీవిత భారాన్నంతా ఆయన మీద పెట్టమని కాదు దాని భావం మనకు తోచిందేదో చేసివేసి తాపీగా కూర్చొని అంతా ఆయనే చూచుకుంటారులే అని కూర్చోక, పశిపిల్లలవలె మారి, వుత్సాహంగా కేరింతా లాడుతూ, నిశ్చితంగా గంతులేస్తూ విధినిర్వణచేయాలి. జీవితాన్ని ఆనందంగా గడుపుతూ, మనస్సులో మాత్రం సుఖశాంతులకు, కుటుంబ రక్షణకు అవుసరమైన శక్తి బాబా కృప వల్లే కలిగిందన్న ఆలోచన వుండాలి.

ఇలా మన కోసరం మాత్రమే ఆయన మేలు కొలుపు కలిగించటము కాక, 1940 ప్రాంతంలో బాబా జరిపిన మస్తాన్ల వేటకు సంబంధించిన ప్రాధమిక వుద్దేశ్యం,

అట్టివారి ఆధ్యాత్మిక అభివృద్ధి కోసరంనిర్దేశించబడింది.ఆయన ఎక్కువగా మారు వేషంలోనే భారత ఉపఖండమంతా తిరిగి ఆధ్యాత్మిక తపన చెందే యీ మస్తుల్ని కలిసి, మానసిక పరంగా పురోగమించేందుకు సహాయం చేశారని యింతకు ముందే చెప్పుకున్నాం గదా! అందులో కొందరు మామూలు సాధువులున్నారు. ప్రాపంచిక జీవితాన్ని పరిత్యజించి ఆధ్యాత్మిక మార్గంలో పయనించేందుకు అన్వేషించే వ్యక్తులు వారంతా. యిటువంటి వారిని బాబా కలవటంతో, భగవంతుని యడల వారికున్న ప్రేమతో, అత్యధిక చైతన్య భూమికల్లో హత్తుకుపోయి, మత్తుగొలిపే అనుభవాన్ని పొందగలిగారు.

తరచు మామూలు పిచ్చి వాళ్ళలా కనపడిపనిచేస్తున్న ప్పటికీ, యీ మస్తులయొక్క అంతర్గత పిచ్చి ఆధ్యాత్మిక మైంది. యిటువంటి వారిని బాబా కలవటంలో చూచే వారికి అర్ధరహితంగా వున్నప్పటికీ, అందులో నిగూఢంగా వున్న ప్రత్యేకతని, ఆయనే ఒకసారి సూచన ప్రాయంగా ఎలా చెప్పారు."మామూలు పిచ్చివాడి మనస్సు, యీ వస్తు ప్రపంచపు సమస్యల ఎడల విరక్తితో వుంటాడు. అయితే ఒక దైవ పిచ్చిగల వ్యక్తి తన మనస్సు యొక్క నిశ్చలత్వం కోల్పోయినప్పటికీ, యీస్థితికిమాత్రంరాడు భగవంతునిపై వుండే ప్రేమవల్ల తమ ఉనికి, పరిసరములు, వారుచేసే పనులు యివేమీ వారికి పట్టవు. మస్తులు మాత్రమే, వారు నన్నెలా ప్రేమిస్తున్నారో ఎరుగుదురు. వారిని నేనెలా ప్రేమిస్తున్నానో నాకు మాత్రమే తెలుసు. నేను మస్తులు కొరకుపని చేస్తున్నాను. వారుకూడ తెలిసో, తెలియకనో నన్నే ప్రేమిస్తున్నారు." 5/1/95

ప్రయాణాల్లో శారీరక శ్రమకు ఎంతో గురై బాగా నలిగి నప్పటికీ, బాబా పీడిత వ్యక్తుల ఎడల మాత్రం తన దయను, ప్రేమను యీమణ్మాత్రం కూడ చెక్కు చెదరనీయ లేదు. ఆయన మారు వేషంలో పయనించినప్పటికీ, గురువుగా వ్యాధిపీడితుల్ని, దీర్ఘరోగుల్ని, నిరాశ నిస్పృహాలకులోనైన వారిని, సర్వమూ కోల్పోయిన వారిని, కలుసుకునేందుకు తిరస్కరించరన్న వార్త వూరూరా పాకి పోయింది. దాంతో వందలాది పీడితులు ఆయన ఆశీర్వాచనాలకై వచ్చేవారు ఇటు వంటి సంఘటనలెన్నో కోకొల్లలుగా జరిగాయి. నోరులేనిపశు పక్ష్యాదులుసైతం దైవీ మానవుని హస్త స్పర్శ భాగ్యం పొంది స్వాస్థ్యత పొందినసంఘటన లెన్నోవున్నాయి.ఆయన స్పర్శ ప్రభావంతో పునీతం కాగా తమ విధేయతను నమ్రతతో వ్యక్త పరిచేవి.

ఆధ్యాత్మిక పథంలో అవుసరమైన, అత్యంత విలువైన విషయాలు నాలుగున్నాయి. 1) దైవ ప్రేమ. 2) గురువు ఎడల విధేయత 3) తోటి మానవులకునిస్వార్థమైన,హృదయ పూర్వక సేవ 4) యదార్థమైనత్యాగం. ప్రాపంచికవిషయా లన్నిటినీ త్యజించటం. దైవప్రేమ, మానవునికి భగవంతు డిచ్చే స్వచ్ఛమైన బహుమానం. నిజానికిది అతి దుర్లభంగా ఏ కొద్ది మందికో అదృష్ట వశాన లభ్యమయ్యే అత్యున్నత బహుమానము. మానవుడు కోరుకొనే, వాటి కన్నిటికీ అతీత మైనది.

ఎల్లకాలల్లోనూ సద్గురువుతో సమాగమ ప్రాప్తి దొర కటం కడు దుర్లభం. తమ జన్మలో సద్గురువుతో సాంగత్య భాగ్యం దొరకటం ఎంతో అదృష్టం. రూమీ చెప్పినట్లు, ఒక

క్షణం ఒక సాదు పుంగవుని సాన్నిహిత్యంలో గడపటం, వంద సంవత్సరాలు ఘోర తపస్సు ఆచరించిన దానితో సమానమట. మరి సాధు సమక్షంలోనే అంతటి శక్తి వున్నప్పుడు, అటువంటి సాధువుల్ని తయారు చేయగల శక్తివంతుడైన సద్గురువు మాటేమిటి? యిటువంటి సాధు సద్గురువుల కతీతుడైన అవతారుని శక్తిని గురించి మనం వూహించుకోవల్సిందే.

నిస్వార్థ సేవ, యదార్థ త్యాగం, అందరికీ అందుబాటులో వుండేవైనా, ఆచరణ మాత్రం, నిజమైన వారులు మాత్రమే పాటించు అవకాశం వున్నది. "అందుకే నేను చెబుతున్నాను. మీధర్మం, మీరు నాకు విధేయులుగావుండటం చిట్ట చివరి వరకూ నాకు విధేయులుగా వుండటం మీ విధి. మీమనస్సు మీపై అనేక ట్రిక్కులు ఆడుతుంది. మనస్సేం చేసినా ఫరవాలేదు. ఏకోరికలైన రానీ. ఏ భయాలైనా రానీ అస్తవ్యస్త పరిస్థితులులైనా రానీ, మీరు నా ఆదేశాల్ని విధేయతతో ఆచరించిన ఫలితంగానా కొంగునుగట్టిగాపట్టుకో గలరు. కనుక ఎట్టి పరిస్థితుల్లోనూ నాకు విధేయులై వుండం డని చెప్పారు. 6/1/1951

"మీ కెవరితో పరిచయమైనప్పటికీ, అంతా నా యిచ్ఛవల్లే జరుగుతుందని గ్రహించండి. నేను చెప్పినట్లు నడుచుకోవటమే మీ యిచ్ఛ అయి వుండాలి. మనస్సంటే ఏమిటి? అంతర్గతానికి, బాహ్యానికి జంతును మనస్సు. అంటే సత్యానికి, దాని ఛాయకు కూడలి మనస్సన్నమాట. మనస్సే కనుక నాశనమైతే, అప్పుడు మీరు సత్యము యొక్క అనంత తత్వాన్ని అనుభవించ గలరు. అందుకే మీరు నాకు విధే

యులు కండు"అని చెప్పారు. దీన్ని బట్టి బాబా విధేయత యొక్క ప్రాముఖ్యత గురించి ఎంత గట్టిగానొక్కిచెప్పారో బోధ పడుతుంది.

మెహెర్ బాబా సోదాహరణలతో వుపమానాలు చెపుతూ నీతి బోధలు చేయలేదు. కటిక నిజాల్ని ఆచరణ రూపంలో తానాచరించి, తన శిష్య గణాన్ని ఉపకరణలుగా వాడు కొని, సర్వమానవాళికి మేల్కొలుపుకలిగించి,యుగావతారుడుగా ముక్తి ప్రదాత అయ్యారు. ఆయన జీవితంలో అత్యంత ప్రధాన ఘట్టం "నవజీవనం". గతాన్ని పూర్తిగా విస్మరించి, వర్తమానమందే జీవిస్తూ భవిష్యత్తుని గురించి ఆలోచించక, గడిపిన కొత్త ఘట్టం. 1949 అక్టోబరు 16న ప్రారంభమై 16 ఫిబ్రవరి 1952 వరకు జరిగింది. యీ ఘట్టాన్ని బాబా మౌనవ జీవనఘట్టం అని పిలిచారు.

సాధారణ మానవలీల నెఱపుతూ, భగవదన్వేషిగా, సఖునిగా వ్యవహారించి, బాబా యీ కాలంలో సంపూర్ణ బాహ్య పరిత్యాగమనే జీవనాన్ని గడిపారు. ఇందులో ఎదురైన కష్టాలు భాధలు, నిరాశామయ, నిస్సహాయ జీవనం అలవడటానికి, శిష్యులతో కలిసి తానే స్వయంగాసృష్టించుకొని. ప్రచ్ఛన్నంగా గడిపినపరివ్రాజక జీవనమది. రామావతారంలో వనవాస జీవిత మెంతటి ప్రాశస్త్యాన్ని పొందింధో మెహెర్ బాబాయొక్క యీ "నవజీవనం"కూడ అంతటి విశిష్టతతో కూడిన మహాత్యాన్ని అందించింది.

నవజీవనంలో ఆయననున్నసరించి తనతోగడిపినశిష్యులు యీఘట్టంలో జరిగిన సంఘటనలు, అనుభవాలుచెప్పినప్పుడు వినేవారికి వళ్ళు గగుర్పొడుస్తుంది. గడగడలాడించే చలిలో

ప అచ్ఛాదనలేని ఆరు బయటపడుకోవటం. గోచిపాతధరించి, బలాఢ్యులు, విద్యాధికులైన శిష్యులుచేత భిక్షాటన చేయించటం, మైళ్ళ కొద్దీ, కాలినడకన ప యనించటం వంటి వెన్నో యీ కాలంలో శిష్యులు చవి చూచారు. ఈ నవ జీవనం శరీరం కంటే మనస్సుకు ఒక పెద్ద పరీక్షవంటిది.కానీ శరీరానికికూడ కష్టం కలిగించే పని కల్పించక పోలేదు.

మొదట్లో బాబా తన దగ్గరకు చేరిన శిష్య గణానికి గత జీవనం అలవడేటట్లు చేసేందుకు, వారు భోగమయ వస్తువుల మధ్య వున్నప్పుడే వారికి త్యాగ బుద్ధి అలవడాలని,ఆశా పరి పూర్తి కొరకు కొరత లేనప్పుడే, నైరాశ్య భావం కల గాలని అభిలషించి, వారికేలోటు రానీయక సకల సదుపాయాలు కల్పించారు. అయితే శిష్యులు మాత్రం, కఠోర నియమాలతో క్రమశిక్షణ పొంది, బాబా ఎడల భక్తి విశ్వాసాలు పెంచుకున్నారేకాని, ఆయనాశించినట్లు, నిరాశామయ నిస్పృహాయ జీవన మలవడలేదు.

అందుకే వారికి భోగమయ వాతావరణం కదిలించి, సర్వసంగ రాహిత్యం కలిగేందుకు, కఠోరమైన తపశ్వి జీవనం సమకూర్చేందుకు సంకల్పించారు. ఈశ్వర లీల నెఱపుతూ, తన శిష్యులకు ఆధ్యాత్మిక శిక్షణలో తర్ఫీదుయిచ్చిన జీవనము పూర్వ జీవనమగుచున్నది.పూర్వజీవనంలోబాబాతన భగవదవస్థానంలో వుండి పరిపూర్ణ దైవత్వం కలిగి వున్నారు కాగా, నవజీవనములో యిటువంటి జీవనాన్ని తన శిష్యుల కలవాటు చేసే వుద్దేశ్యంతో ఆయన తన ఈశ్వరావస్థానం నుండి, మానవావస్థానానికి దిగి వచ్చారు. 7/11/98

12)

ఈ జీవితం క్రొత్తదైనా, జీవుడు మాత్రం. పాత వాడే నవ జీవన కాలంలో బాబా అత్యంత సామర్థ్యంతో శిష్యులవ్యక్తిగతఅలవాట్లు,ఆవేశాలు,ఆసక్తులు,ఆశలుకోరికలు వాంఛలు మొదలైనవాటన్నిటినినిర్మూలింపచేశారు.వారికివీటి నుండి విమోచనం కలిగించి, ఆ రూపంలో పుండే అడ్డుగోడ లన్నిటినీ, కూల్చి వేశారు. తాను పెద్దన్నయ్యగా గడిపి తన సహాచరులు గురు శిష్య సంబంధం మరిచి పోయేలా చేశారు. ఆయన్నా కాలములో అనుసరించిన శిష్యులంతా, బాబాయే తమ సర్వస్వమని నమ్మికుని, సర్వమూ త్యజించి, ఆయన్ని ఆశ్రయించినవారు. బాబాక్రింద ప్రేమమయవాతావరణంలో శిక్షణ పొందిన వారే. బాబా వారికిచ్చిన శిక్షణ మానవ జీవనంతో తారస్థాయికి చేరుకున్నది.

నవ జీవనంలో జీవించటమంటే, యీ ప్రపంచాన్ని వదిలేసి, కాషాయ వస్త్రాలు ధరించి, భిక్షాటన చేస్తూ జీవించటం కాదు. అతి సహజంగా జీవితాన్ని గడపటాన్నే నవ జీవన మన్నారు. సహజమైన జీవనం నిష్కపటానికిపరిణామం నిశ్చలత్వం, ప్రేమ దయలకు ప్రేరణ. మోసానికి, అహంకారానికి అ జీవనంలో చోటు లేదు.అందుకేబాబా స్వేచ్ఛను ఆచరణలో యితరులపై బలవంతంగా రుద్దక తాను గడప దలచిన జీవితంలో ఆదర్శప్రాయంగా ముందు తానాచరించి, తన సహచరు లాచరించేట్లు అలవర్చారు పైగా తాను వారి పెద్దన్నయ్యలా ఒక మిత్రునిగా మాత్రమే మెలిగారు.

నవజీవనమంటే,ప్రాపంచిక వ్యవహారాల్లోతనవిద్యుక్త ధర్మాల్ని విడనాడి, బాధ్యతల్ని విస్మరించటం కాదు. అది ఒక క్రమ శిక్షణతో కూడిన జీవితం. నిష్కపటం, ప్రేమ,

విధేయతలు యీ జీవితంలో ముఖ్య లక్షణాలు. భావితరాల్లో కూడ, ఎవరైతే వీటిని తమ నిజ జీవితం తప్పక ఆచరించ కలుగుతారో, వారే ఆయన యిచ్ఛకు పాత్రులవ గలరు.

బాబా మనకు తన నవజీవనానికి అనుగుణ్యమైన శిక్షణ నందించారు. ఇప్పుడు బాబా తన శరీరాన్ని త్యజించినా, ఆయన ఆయనగానే మిగిలి వున్నారు. మనందరినీ ఆయన ప్రక్కనే వుంచి వెళ్ళారు. శరీర త్యాగానికి ముందు మన ప్రక్కనే ఎలా వున్నారో అలాగే యిప్పుడూ మన ప్రక్కనే వున్నారు. అయితే అప్పుడాయనే మన ప్రక్క నున్నారు. యిప్పుడేమో ఆయన ప్రక్కనుండటం మన వంతైంది. నవ జీవనం ద్వారా బాబా యిచ్చిన శిక్షణావిధానపు ప్రత్యేకతే. బెత్తం పుచ్చుకొని పాఠాలు నేర్పినట్లుకాక, ఎంతో సరళ భావంతో, ప్రేమ మార్గంలో సత్యాన్ని తెలుసుకోగలిగే టట్లు చేయటం యిందులో ప్రధానం. మనస్సుకు బోధలు చేసి నేర్పటం కాదు నిర్మొహమాటంగా అభిప్రాయాల్ని వ్యక్త పరచటమంత కంటేకాదు.

ఆయన ఎప్పుడూ హృదయంతోనే పని చేసేవారు. మన హృదయాల ద్వారానే మనల్ని చేరేవారు. నిత్య కృత్యాల్లో వుంటూ, ప్రాపంచిక వ్యవహారాల్లో మునిగి నా దైవాన్ని స్మరించే మార్గాన్ని చూపారు. సత్యము,అసత్యముల మధ్య భేదాన్ని తెలుసుకొనేట్లు చేసి, అశాశ్వతమైన బంధాల్ని మనస్సునుండి పార ద్రోలితే భగవంతుడ్ని స్మరించటం తేలికేనని ఆచరించి చూపారు. "నీ విధులన్నీ నిర్వర్తించు. కానీ నీ మనస్సుని మాత్రం దైవంపై లగ్నంచేయి కుటుంబంతో కలిసి జీవించు. భార్యాపిల్లలు, తల్లితండ్రి—వారి

సేవ చేయి. వాళ్ళంతా నీకు కావలసిన ప్రేమ పాత్రులుగానే చూచుకో. కానీ వాళ్ళంతా నీకు సంబంధించిన వాళ్ళు కాదని, నీ హృదయాంత రాళాల్లో తెలుసుకో"

తాబేలు నీటిలో తిరుగుతున్నా దాని మనస్సంతా ఒడ్డున పెట్టిన దాని గ్రుడ్లు మీదే వుంటుంది. భాగ్యవంతుని యింట్లోపని మనిషి ఇంటి పనులన్నీ చేస్తుంది. కానీఆమెఆలోచనలన్నీ తన యింటి మీదే వుంటాయి. తన యజమాని పిల్లల్ని తన పిల్లల్లాగే పెంచుతుంది. వాళ్ళని "నాబాబే", "మాతల్లే" అంటూ పిలుస్తుంది. కానీ వారు తన పిల్లలు కారని ఆమెకు తెలుసు. అయినా తన పిల్లలలాగానే చూస్తుంది. అలాగే మనంకూడ ప్రపంచంలో మన ధర్మాల్ని నిర్వర్తించాలి. అదే సమయంలో మన మనస్సుని మాత్రం దైవంపై లగ్నం చేసుకోకలగాలి. యీ సత్యాన్ని మనం తెలుసుకోగలిగేందుకు అణుక్షణం ఎన్నెన్నో అనుభవాలు కల్పించి, తగు తర్ఫీదు నిచ్చారు.

ఎండ కన్నెరుగని స్త్రీలను, శ్రమ నెరుగనిపురుషులను వెంట బెట్టుకొని, తెల్లటి బారుగౌను, పచ్చటి తలపాగా ధరించి, చంకలో జోలె వేసుకొని చేతిలో కారేజీ పట్టుకొని నడి బజార్లెంట, పదిమంది మధ్య కూర్చుంటూ లేస్తూ నానా యాతనాపడి సంచార జీవితంగడిపారంటే,అది ఆయనకోసరం చేసింది కాదు. చూచే వారికి వారంతా శారీరకంగా శ్రమతో కూడిన కష్టాలనుభవిస్తున్నట్లు కనపడుతుంది. వారెన్ని యిడుముల్ని శారీరకంగా అనుభవించినా వాటన్నిటినీసంతోషంతో స్వీకరించారు.ఆయన సమక్షం ఎటువంటి కష్టాలైనా మరిపించేది. వారు శారీరక కష్టాలెన్నిటిని అనుభవించినావాటన్నిటినీ

మించినది, మనస్సు నుండి వెలువడే మానసిక సంక్షోభాన్ని భరించటం ప్రధానం. ఇలాంటి సంక్షోభాల్ని శిష్యులంతకు మును పెన్నడూ చవి చూడ లేదు. వారు కేవలం ఆయన ఆజ్ఞలకు బద్ధులై సంచరించే వారు. అందువలన వారికి మరో ఆలోచనే వచ్చేది కాదు.

నిజానికి వారీ ప్రపంచాన్నే పూర్తిగా విస్మరించి, ఏ యితర విషయాల పైన,మనోభావాలు పోనీయక బాబా మీదే లగ్నం చేసి వుంచేవారు. ఈ వేళ తింటే రేపు మళ్ళీ దొరుకుతుందో దొరకదో తెలియని పరిస్థితిలో జీవిస్తున్నా దేన్నీ ఖాతరు చేసేవారుకాదు. అకుంఠిత దీక్షతో శుశ్రూష చేసి, తను సర్వస్వం త్యాగభావంతో బాబాకు అర్పించుకొని, నిరాశాయము, నిస్సహాయ జీవనానికి అలవడినప్పటికీ, ప్రకృతి సహజమైన వారి మనో ప్రవృత్తిని అరికట్టుటకు, మరింత బలీయమైన తర్ఫీదు అవుసరమైంది.

బాబా 1949 అక్టోబరు16న ప్రారంభించిన నవజీవనం, రెండు సంవత్సరాల పాటు నిరాఘటంగా కొనసాగింది. ఆ తర్వాతఆరునెలల పాటు మనోనాశ్ (అమనస్క యోగం)అనే కార్యక్రమాన్ని చేపట్టారు. మతపరమైన, సాంప్రదాయాలను, కర్మకాండలను, ఆహుతి చేసి, మనస్సు అనే దుష్ట ప్రభువును, తన పరివారమైన కామక్రోధాది అరిషడ్వర్గములతో సహా భగవత్ప్రేమాగ్నిలో భస్మీపటలం కావించి, మనస్సుకి జ్ఞానానుభవమును కలిగించటం, యీ మనోనాశ కార్యక్రమ విధానము.

"మనోనాశ్" అంటే మనస్సును క్షాళనము చేయుటము ద్వారా నాశనం చేసి, ఆత్మకు పరిపూర్ణత్వం కలిగిం

చటం. " మనస్సనేది ప్రపంచాల్ని సృష్టిస్తుంది. భ్రాంతిని భ్రమల్ని కలిగిస్తుంది. అది నిన్ను నాట్యం చేయిస్తుంది. ఇది "నేను" "నాది" "ఇది నా భార్య, ఇది నాబిడ్డ" అంటూ ఆలోచనలను కల్పిస్తుంది. "నేను స్త్రీని, పురుషుడ్ని" అన్న భ్రాంతిని కల్పిస్తుంది. జననమరణాల్ని సుఖదుఃఖాల్ని నిజమనే విధంగా నీవనుకోనేట్లు నీ మనస్సే చేస్తున్నది. నీవు, నీ భార్య, నీ పిల్లలు అంతా ఒక్కరే అని నీవు తెలుసుకోగలిగితే, నీ వెప్పుడూ పుట్టవు, ఎప్పుడూ మరణించవు అన్న సత్యాన్ని తెలుసుకోగలిగితే, అంతకంటే కావలసిందేమిటని" బాబా మనస్సు గురించి వివరిస్తూ, సంస్కారాల ఇంద్రజాలంలో ఎంతో నేర్పుగా బంధించబడుటకు కారణభూతమైన యీ మనస్సు నాశనమయ్యే మార్గాన్ని యీ మనోనాశ్ కార్యక్రమంలో తానాచరించి చూపి మనకు మార్గదర్శకులైనారు.

పోగుచేసుకున్న సంస్కారాల బట్టి మనస్సుమారుతుందే తప్ప, అది రూపాంతరం చెందదు. మనస్సనేది మిథ్య అది మిథ్య గనుకనే దానిని నాశనం చేయుట సులభమంటారు బాబా. యిప్పుడు మీరు పురుషుడిగా వున్నారు. ఒక వేళ యీ శరీరంపోయి ఒక స్త్రీగా జన్మించినప్పుడు, మీరే అప్పుడు "నేనొక స్త్రీని" అంటారు కదా. ఇక్కడ "నేను స్త్రీని" అనే స్త్రీగా వుండటం మిథ్య. నిజమైన రూపాంతరం జరిగేంత వరకూ యిలా నేను "స్త్రీని, పురుషుణ్ని" అనుకోవడం కొనసాగుతూనే వుంటుంది. దీనిలో "అహం" అనేది రూపాంతరం చెందుతున్నదే కానీ, మనస్సనేది రూపాంతరం చెందలేదు.

నిజానికి బాబా మనోనాశ కార్యక్రమం చేపట్టారంటే, అది ఆయన కవసరమైకాదు. ఎవరో అదృష్టవంతులు, కొందరు తమ మనస్సులను క్షాళన పరుచుకొని, అ మనస్కులు కావలసియున్నది. యీ విధంగా ఆ సమయంలో మనో నాశం జరుగవలసిన అభిళాషా పరులకు సహాయపడ్డారన్నమాట. ఆయన మనస్సు విశ్వాత్మకమైనది. మానవుని మనస్సులా కలుషితము సంకుచితము, సంస్కారయుతమైనది కాదు. అటువంటి విశ్వాత్మక మనస్సు నాశన మొనరించబడితే, మన అందరి మనస్సులు నాశన మొనరించ బడినట్లే! 1951 అక్టోబరు 16న హైదరాబాదు కొజ్జాగడ్డ దగ్గరున్న కొండ మీద మనోనాశ్ ఘట్టాన్ని ప్రారంభించి, నాలుగు నెలల పాటు కొనసాగించి, 1952 జనవరి 31న మెహరాబాదులో ధునీ వెలిగించటం ద్వారా జ్వాలతో అంతమైంది.

ఈ విధంగా మనోనాశకాలం దాదాపు నాలుగు నెలలు పట్టింది. యీ ఘట్టంతో బాబా ప్రారంభించిన నవ జీవన కాలం కూడా నూటికి నూరుపాళ్ళు దిగ్విజయంగా పరిసమాప్తమయింది. మనోనాశకాల సమయంలో బాబా, అఐదు ప్రధాన మతాలకు ప్రతీకలైన అయిదు రకాల పాలరాతి దేవాలయ నమూనాల్ని ఆగ్రాలో ప్రత్యేకంగా తయారుచేయించి ఆదిగారితో తెప్పించారు. యీ కాలంలో వాటితో ఆయన ఏమి చేసారో తెలియదుకానీ, ఏకాంతంగా వాటిని ఒకగదిలో వుంచుకొని, ఎవరికీ, తెలియని కార్యక్రమమే విడవకండా చేశారు. వాటిని ఎవరినీ తెలియని తాకనిచ్చేవారుకాదు.

నవజీవన ఘట్టం పరిసమాప్తము కాగానే బాబా మెహెరాబాద్ లోని మనోనాశ్ గది వెనుక భాగంలో ఒక గుండం తవ్వించి, 1952 జనవరి 31 సాయంత్రం సూర్యాస్తమయమైన తర్వాత, "ప్రపంచంలోని అన్ని మతాలవారు ఆచరించే కర్మకాండలు, పూజాపునస్కారాలు, సాంప్రదాయాలు, యీ నాడీ అగ్నిగుండంలో అగ్నికి ఆహుతి చేయబడినవి" అని ఒక చీటిపై వ్రాయించి, బాబాయే స్వయంగా ధునీలో అగ్ని రగిల్చి, జ్వాల పుంజుకొని మంటలు పైకెగయగానే ఆ చీటిలో వ్రాసిన మాటల్ని ఈరుచ్ చేత బిగ్గరగా చదివించి ఆ తర్వాత దాన్ని ముక్కలుగా చించి, మండుతున్న ధునీలో వేసి కాల్చివేశారు. గుండంలో సమిధలన్నీ కాలి బూడిదయ్యేంత వరకూ జాగ్రత్తగా చూస్తూ దాని ప్రక్కనే కూర్చున్నారు.

అవన్నీ పూర్తిగా బూడిదయింతర్వాత, ఆ భస్మాన్ని ఎవరూ తాక కూడదని, అందుచేత, దాన్ని డబ్బాల్లో పెట్టి సీలు చేయించారు. దగ్గరుండి, ఈరుచ్ చేత ఆ గుంటని పూడ్పించారు. ఆనాడు అలా దహించి వేయబడిన బూడిద యిప్పటికీ చెక్కుచెదరకుండా భద్రపరచబడి, ప్రస్తుతం, మెహరాబాదు కొండ పైవున్న ప్రదర్శనశాలలో బాబా వాడిన వివిధ వస్తువులతోపాటు వుంచబడినవి. కర్మకాండలు, ఆచారవ్యవహారాలు, పూజాపునస్కారాలన్నీ అగ్నికాహుతి గావించబడిన వాటి తాలూకు భస్మం కనుక, మళ్ళీ దాన్ని తాకి వాటిని ఆహ్వానించరాదన్న భావంతోనే దాన్నెవరూ ఎటువంటి పరిస్థితులోనూ వుపగియోగించవద్దని బాబా శాశించారు.

16/1/95

మెహెరాజాదు ఆస్థి అంతా ఆయన భార్య పేర సంక్రమించిన ఫలితంగా, మెహెరాజాద్ యీ నాటికీ నారిమన్ భార్యఆర్నావాజ్ పేరనే వున్నది. ఫలితంగా మెహెరాబాదు పబ్లిక్ ఆస్థి అయితే మెహెరాజాదు ప్రయివేటు ఆస్థిగామిగిలింది. అవతార్ మెహెర్ బాబా ట్రస్టు వారి ఆధ్వర్యంలో యీ రెండు ఆస్తులు కూడ దినదినాభివృద్ధి చెంది కలియుగ వైకుంఠంగా మారి పోతున్నాయి.

సాధారణంగా మానవులు మహాత్తులు కోరుకుంటారు. ఆధ్యాత్మిక కోణంలో చూస్తే మహాత్తులు చేయటం ఒక ప్రహసనం లాంటిది. యిది మాయతో ఆడుకోవటం క్రింద లెక్క. సామూహికంగా మానవాళికి ఆత్మ సాక్షాత్కారం చేసే ఆధ్యాత్మికావసర మేర్పడినప్పుడు తప్ప మహిమల్ని చేస్తే అవి అసహజమైనవౌతయి ప్రకృతి విరుద్ధమైనవే కాక, భగవంతునిచే నిర్దేశించ బడిన పరిణామ క్రమవిధానంలో జోక్యం కల్పించు కోవటమే అవుతుంది. కొందరుసద్గురువులు మహిమలు చేయటం జరుగుతుంది. వారా మహిమల్ని, అవి చేసే సమయంలో వుండే పరిస్థితులపై ఆధార పడివుంటుందని బాబా వివరించారు. సద్గురువులటువంటి మహిమల్ని విశ్వానికి ఒక వూపు యివ్వదలుచుకున్నప్పుడే చేస్తారుకానీ, సోమరి తనపు జిజ్ఞాసుల కోరిక తీర్చేందుకు, వాళ్ళ తృప్తి కోసరం మాత్రం మహిమలు చేయరని బాబా వివరించారు.

అందుకే బాబా "నేను భగవంతుడ్ని. నేనేసర్వస్వము" అని ప్రకటించినా మహిమల కతీతంగా వున్నారే తప్పవాటి నెన్నడూ చేయ లేదు. ఎవరి అనుభవంలోనైనా వీటి అను

భూతి జరిగినప్పుడు, వాటితో తన ప్రమేయం లేదని, వారి నమ్మకమే అలాంటి అనుభవాన్నిచ్చిందని చెప్పేవారు. ఈ సృష్టంతా ఒక మహత్తు. ఈ ప్రకృతిలో మనము పాటించ వలసిన నియమం, కార్య కారణ నియమం. జీవితగమనంలో అనుక్షణం జరిగే ప్రతి చర్య వల్ల సంస్కారాలుత్పన్న మవు తాయి. సంచిత, ప్రారబ్ధాలతోపాటు, యీ జన్మలో సంక్ర మించే ఆగామి కర్మలన్నిటినీ జీవుడుఅనుభవించటమేవుత్తమ సంస్కార విధానము. జీవుడు తానుసంపాదించుకున్నకర్మలు అనుభవించక, సహజ కర్మల కతీతుడై ,మహాత్ములు ద్వారా విముక్తుడు కావాలని ఆకాంక్షిస్తే అది నియమోల్లంఘన క్రిందకే వస్తుంది. 8/2/95

సహజ నియమాలకతీతంగా వాటిని ధిక్కరించి, తెలి యని ఏవో అసహజ నియమాల ద్వారా చేసే మహత్తులు శాశ్వతం కాబోవు. అటువంటి చర్యాలు, ప్రకృతి కను గుణ్యంగా వుండక, గారడీలా మిగిలి పోతాయి. ఆధ్యాత్మ ప్రపంచంలో అలౌకికమైన నియమాలన్నిటినీ నియంత్రణ చేయగల శక్తి ఒక్క భగవంతుని శక్తికే వుంది. యీ భగవ త్శక్తినే, దైవ కృప అంటారు. అవిచ్ఛిన్నంగా కర్మ సిద్ధాం తంలో కొట్టుమిట్టాడుతున్నా, విడవకండా సదా ఆయన్నే స్మరించ కలిగిన వారీ దైవ కృపకు పాత్రులవుతారు.

భగవంతుడు తప్పుల్ని క్షమిస్తాడంటారు. అంటే దానర్థం, మనమెప్పుడూ తప్పులు చేస్తూ వుండమని కాదు. తప్పులు చేయటం మానవ సహజం. చేసినతప్పుకు పశ్చాత్తాప పడటం ప్రధానం. పశ్చాత్తాపంతో భగవంతుని అర్థించే క్షమా పణ ఆయనలోని కృపను మేల్కొలుపుతుంది. ఆయన ముక్తి

మార్గాన్నెప్పుడూ తెరిచే వుంచానన్నారు. కనుక ఏకైక మహిమంటూ ఏదైనా వుంటే, అది ఒక్క దైవ కృపే నన్నారు బాబా. "నేను చేసే మహిమ, మరణించిన వారిని బ్రతికించటం కాక, ఎవరైనా సరే, భగవంతుని కొరకు జీవించేందుకు, వారిని మరణించేట్లు చేయటమే నేను చేసే మహిమ" అని చెప్పారు.

తనపై నిశ్చలమైన గట్టి నమ్మకము, అచంచలమైన ప్రేమ పెరిగేందుకు ఆంతరంగిక ప్రేరణ కల్పించి, సత్య పథంలోనిమార్గాన్ని సుస్పష్టమయ్యేట్లు,సురక్షితంగావుండేట్లు తన కృపను వర్షించేట్లు చేశారు. అదే మెహెర్ బాబా చేసిన మహత్తు. ఇప్పటికే సృష్టించబడిన యీ అనంతమైనమాయా జగతిలో, మరల, అనుకరించే చిన్న చిన్న మాయా మహిమలకు విలువీయక, అకాలంలో ప్రాప్తించే శారీరక,మానసిక బాధల్ని, భగవంతుడు మన కిచ్చే కానుకలుగా స్వీకరించి నప్పుడు, ఆధ్యాత్మిక స్వాతంత్ర్యత సంప్రాప్తించబడటమేకాక, శాశ్వతానందానికి చేరుస్తుందని బాబా హామీ యిచ్చారు.

బాబా మన మధ్యకు సంపద, పిల్లలు, దీర్ఘాయుష్షు లాంటి వరాలిచ్చేందుకు రాలేదు. నాదంటూ ఏమీ వుంచుకోకుండా సమస్తం ఆయనకు సమర్పించుకోగలిగితే తనను తానే మనకు సమర్పించుకుంటానంటాడాయన. ఆయన మన హృదయ సామ్రాజ్యాధిపతి. తాను కోట్లు పుచ్చుకున్నాడు. అలాగే కోట్లాది రూపాయలు ఖర్చు చేశాడు. ఇంద్ర భవనాల్లోనూ వున్నాడు. నిరుపేదల గుడిశల్లోనూ వున్నాడు. అయితే తనకంటూ ఒక్క సమాధితప్ప మరింకేం మిగుల్చుకోలేదు. తనస్వంత సమాధిని స్వయంగా

నిర్మించుకున్నారు. భ్రష్టత్వాన్ని కలిగించే ధనాని కతీతు డాయన. 9/2/95

అమెరికాలో కొందరు కోటీశ్వరులు విలువైన ధనకనకాదులెన్నో సమర్పించు కోవాలనుకుంటే, తిరస్కరించారు. తాను అతి సామాన్య భోజనం చేసినా, తన ప్రేమికులకు మృష్టాన్న భోజనం పెట్టేవారు. సహవాస సమయాల్లో, పేదలకు లడ్డూలు, మామిడి పళ్ళు వంటివి పంచి పెట్టేవారు. అటు వంటప్పుడుకూడ తాను మాత్రం కొద్దిగా పప్పూ అన్నం మాత్రమే తినేవారు. ఏదైనా ఖర్చుకు చందాలు వసూలు చేస్తే ఖర్చులు పోను మిగిలిన పైకాన్ని సమంగా మళ్ళీ అందరికీ చందాదారులకు పంచిపెట్టిన మహనీయుడాయన.

ఆయన సరళస్వభావి. పేరు ప్రతిష్టలు కావాలని కానీ, తన పేరుమీద ఓ మతాన్ని స్థాపించాలని కానీ ఎన్నడూ అభిలషించలేదు. ప్రచారాన్నెన్నడూ కోరలేదు. కోటీశ్వరులు రాజలాంఛనాలతో విలువైన దుస్తులు కట్టబెట్టి, బంగారు ఆభరణాలు తొడిగి రత్న ఖచిత సింహాసనంపై కూర్చోబెట్టేందుకు సిద్ధపడితేవారి తృప్తికోసరం పూలమాలమాత్రమే స్వీకరించి, కేవలం రెండు చింకి కోట్లు మాత్రమే వుంచుకున్న రాజర్షి ఆయన. ఆయనమతం, హృదయమతం. ఆలోచనలకు, మాటలకు, వేదాంతానికి అతీతమైనది. జీవిత రహస్యానికి సంబంధించిన తాళం చెవిని పొందాలంటే పరిశుద్ధమైన హృదయమనే పుస్తకాన్ని చదవమని చెప్పారాయన. ఈ జీవితం భగవంతుడున్నుండి వచ్చింది. దాన్ని మళ్ళీఆయనకు తిరిగి యిచ్చి, ఆ దైవం కావాలి. యిలామానవుడ్ని దేమునిగా తయారు చేయడమే ఆయనపని.

ఆయన ప్రేమకు ప్రతీక. స్త్రీలు, పురుషులు, పిల్లలు, ముష్టివారు, కుష్టురోగులు, అంటరానివారు, మునులు, బందిపోట్లు ఒకరేమిటి, కులమత వివక్షత లేకుండా, అంటు ముట్టు బేధం లేక, పేద బిక్కి తారతమ్యంచూపకుండాసమదృష్టితో అందరినీ ఆలింగనం చేసుకున్న మహానీయుడాయన. మూర్ఖులకు, మస్తులకు, పిచ్చి వాళ్ళకు, సంస్థలు నడిపినమహాపురుషుడాయన, సర్వులలోను భగవంతుడ్ని చూడ కలిగిన ప్రియతముడు బాబాజీ. సమదృష్టి, విశ్వాత్మక మంత్రాంగం జరిపి మత విశ్వాసాలకు, మూఢ నమ్మకాలకు అతీతంగా, మానవాళిని మేల్కొల్పి, సహజదివ్యత్వానికిచేర్చేందు కెంతోకృషి సల్పారు.

"మంచి విశ్వాసంతో దేముడ్ని నమ్మండి. మీరునమ్మకముంచి, ఆయన యిచ్ఛకు విధేయులైతే, మీ కష్టాలన్నీ ఆయనే పరిష్కరిస్తాడన్నారు" బాబా. ప్రేమ కోసరం సమస్తం త్యాగం చేయి. ఆ ప్రేమే నిన్ను ప్రియతముని చెంతకు చేరుస్తుంది. అటువంటి దైవ కృప పొందేందుకు దాగుడు మూతలు పనికి రావు. ఏకాగ్రతపై దృష్టిని సారించాలి. నామరూపాలన్నీ ఒట్టి మాయ. కనుక పేర్లుమారుస్తూ అత్యధిక దేముళ్ళపై మనస్సును ప్రసరించనీయవద్దు. యిష్ట దైవముగా ఏదో ఒక నామాన్ని, ఎదో ఒకరూపాన్ని ఎంచుకొని పరిపూర్ణ సమర్పణ కావించుకొంటే, సత్యం గ్రహించేందు కెంతగానో వుపయోగపడుతుంది. యాంత్రిక ధ్యానం యాంత్రిక భక్తి మెట్ట వేదాంతం లాంటివి. ఏ పేరు పెట్టి పిలిచినా పలుకుతాను" అన్నారు బాబా.

ప్రేమ ద్వారా జ్ఞానం పుష్పంలా వికసించాలి.

అప్పుడే పువ్వు పిందై పండుగా పెరుగుతుంది. బాబా అవతరించింది మానవ హృదయక్షేత్రంలో ప్రేమ బీజాన్ని నాటేందుకే. ప్రేమ ద్వారా మానవాళిలో ఏకత్వ చైతన్యాన్ని తెచ్చేందుకాయన అవతరించారు. ప్రేమలో ఏకత్వమన్నదాయన మనకిచ్చిన మౌన సందేశం. ఆయన మౌన స్పర్శతో మన హృదయాల్ని మేల్కొలిపారు. ప్రేమ హృదయాల్ని సమైక్య పరిచినప్పుడే అవి ఐక్యమవుతాయి. అద్వితీయ ఆత్మతో, ఆత్మలన్నీ పరస్పర సంబంధం పెట్టుకున్నప్పుడు. యావత్ప్రపంచం, సమైక్యమవుతుంది. 15-2-95

నేను నీవన్న ద్వంద్వభావం పోవాలి. యీ ద్వంద్వాలనుంచి విముక్తి కలిగితేకానీ, శాశ్వతమైన మాధుర్యం బయట పడదు. చిరస్థాయిగా వుండే ఎన్నటికీ చెడిపోని యీ మాధుర్యం అందరిలోను వుంటుంది. అది అనంత మహాసాగరం వంటిది. ప్రతివారు అందులో కలిసి తీరాలి. అందుకు కావలసింది ధార్మిక సాంప్రదాయాలు కాదు. ప్రేమ కావాలి. దివ్యప్రేమ స్వార్థాన్ని, ఈర్ష్య, ద్వేషాల్ని జయిస్తుంది. యీనాటి మానవుడు యీ సత్యాన్నందించే సందేశాత్మక బోధల్ని పెడచెవిన పెడుతున్నాడు. ఇంతకు ముందెవరో చెప్పిన ధర్మసందేశాలన్నీ ఎందుకూ పనికి రాకుండా పోయాయి. తిరమక పెట్టే మత మౌఢ్యపు కారు మేఘాల్లో. తన గమ్యంచేరే మార్గం తెలుసుకోలేక, అల్పకోరికలతో అత్యున్నతబోధల్ని నైతం మృతప్రాయంచేసి సమాధి కడుతున్న యీనాటి మానవాళి నుద్ధరించేందుకాయన మౌనావతారుడిగా మన మధ్యకు వచ్చి, తన కొంగు బంగారు భాగ్యాన్ని కలుగ చేశారు.

యుగయుగాలుగా కనపడకండా పాతుకున్న "నేను" "నాది" అన్న మాయ తెరను తన ఆలింగన ప్రాప్తితో పటాపంచలు చేశారు. కోరికలతో తన చెంతకు రావద్దన్నారు. అడిగిపుచ్చుకున్నప్పుడాయన కృప నీటితో సమానమట. బలవంతపరిచి పుచ్చుకున్నప్పుడు రక్తంతో సమానమట. కానీ ఆయన యిచ్ఛకు పాత్రులమైనప్పుడు తనంతట తానుగా తన యిచ్ఛతో యిచ్చినప్పుడది, పరిశుద్ధమైన తేనె కలిపిన పాలవంటిదట. మరి అటువంటి మెహెర్ కృపకు పాత్రులమ య్యేట్లు చేసేందుకు, మెహేర్ బాబా మానవుడిగా పరిమిత రూపంలో బంధించుకొని మన మధ్యకు వచ్చారు.

"మానవులు తమ కర్మలాచరించేందు కిష్టపడరు. కానీ సమస్తం నాపై గుమ్మరించేందుకే నా వద్దకు వస్తారు. ఇది బాబా భాష్యం. నిజానికాయన పలకడు. ఆయన కళ్ళు మాట్లాడేవి. అందమైన ఆయన వేళ్ళు అక్షర ఫలకముపై పరుగులిడుతుంటే, సౌంజ్ఞలతో వేళ్ళు కదులాడుతుంటే, ఆయన ముఖకవళికలు, హావభావాలు చూచినప్పుడు, ఆయన పెదవులు కదలాడక పోయినా మనతో మాట్లాడుతున్నట్లే అనిపించేది. భగవంతుడంటే బోధించబడువాడు కాడని, జీవించ బడవలసిన వాడని చెప్పి ఆచరించి చూపిన అద్వితీయ ఆదర్శ అవతారము మెహేరవతారము.

"నేనే దైవములకెల్ల దైవాన్ని, ఏకోత్తమునితో అనుబంధం పొందిన వారెంతో అదృష్టవంతులని, అనేక త్వంతో అనాసక్తి పెరిగి, ఏకోత్తమునితో అనుబంధం పెరి గినప్పుడు, ముక్తికి తాళం చెవి దొరికినట్లే"నని బాబా చెప్పారు. "అతిగొప్ప ధనసంపదను మానవుడు పొందేందుకు

కనువుగా తెచ్చాను. ఈ నిధి సర్వ నిధులకు నిలయం" శాశ్వతంగా నిలిచేదది. ఎన్నటికీ తరగక నిలవ వుంటుంది. ఎందరెంత పంచుకున్నా అది యింకా పెరుగుతుంది. కనుక యిట్టినిధిని పొందేందుకు మీరంతా సిద్ధంగా వుండండ"ని తన మౌన విశిష్టతను గురించి వివరిస్తూ, "నాయీ ప్రస్తుత అవతార రూపం, యీ యుగంలో చిట్టచివరిజన్మ కనుక నా ప్రత్యక్షీకరణ ఎంతో ఘనంగా వుంటుంది. నేను నా మౌనాన్ని విడనాడినప్పుడు, నా ప్రేమ యొక్క భారీ ప్రభావము, విశ్వాత్మకమై సృష్టిలోని సకలజీవులు దానిననుభవించగలవ"న్నారు.

భగవంతుడు అనంత శక్తిజ్ఞాన ఆనందములు కల త్రిగుణాత్మకుడు. అవతారుడు సాక్షాత్తు భగవంతుడే కనుక తానుగా మానవుడై పుడమి మీద అవతరించాడు. ఆయన మహా శక్తి జ్ఞానానంద సాగరుడైనప్పటికి, మెహేర్ బాబా తాను అవతారునిగా మంత్రాంగం నెఱపిన రోజుల్లో తన అనంత జ్ఞానాన్ని మాత్రమే వుపయోగించినట్లు చెప్పారు. ఆయన తన అనంతశక్తిని అనంతజ్ఞానాన్ని వుపయోగించక, మానవాళిని, వారి బాధలనుండి విముక్తిపరిచేందుకు, తానే విశ్వాత్మక బాధల్ని, నిస్సహాయతని అనుభవించాడు. 1962-68మధ్య భాగంలో ఆయన శారీరకంగా ఎక్కువ బాధలు అనుభవించారు. 1965 ఆ ప్రాంతంలో బాధా నివారణ కొరకు ఔషధ సేవనము కూడ తిరస్కరించారు. ఎటువంటి మందులు తనకు వాడవద్దని సన్నిహిత మండలినాదేశించారు. తన వునికిని గురించి, తన సత్యప్రేమ సందేశాల్ని బహుళ

ప్రచారము చేసేందుకా సమయంలోనే శిష్యుల కనుమతించారు.

"నన్ను గట్టిగా పట్టుకొని వుండండి. అందువలన నేనెక్కడకు వెళితే మిమ్మల్నక్కడకు తీసుకువెళతాను. నేను మహాచక్రవర్తిని. మీరు నాకు చెందినవారైతే, నాదైన అనంత ధనాగారంలో ప్రవేశించే అర్హత కలిగి వుంటారు. అలా కాక, నా రాజభవన రక్షకులు, సేవకుల [సాధువులు, యోగులు, మునులు] దరి చేరితే అది కేవలం మీ మూర్ఖత్వమే అవుతుంది. నేను శారీరకంగానూ, మానసికంగానూ కూడ వ్యధ చెందుతున్నాను. శారీరకంగా నేను పడుతున్న బాధను మీరు కళ్ళారా చూస్తున్నారు. అయితే మానసికంగా నేను పడే బాధ మీకు తెలియదు. భగవత్ వ్యతిరేకత ఎక్కువగా పెరిగిపోయి, సాధుసాన్యాసులుగానో, ఆధ్యాత్మిక సంపన్నులుగానో నటిస్తూ తమకుతామే గొప్పగా చెప్పుకొంటున్న వారెక్కువగుట వలన నేసు మానసిక వ్యధను అనుభవించవలసివచ్చినది."

"యిటువంటి రహస్యాల్ని నేనింతకు ముందెన్నడూ నా పూర్వ ఆవతారకాలాల్లో వెల్లడించలేదు. ఎందువల్లనంటే అప్పట్లో సమయం యింకా పరిపక్వం కాలేదు. యీనాడు శాస్త్రవిజ్ఞానం అపారముగా అభివృద్ధిచెంది కుప్పతెప్పలుగా పెరిగింది. దానితోపాటు భగవత్వ్యతిరేకత కూడ గరిష్టస్థాయికి చేరుకున్నది. కనుక యిటువంటప్పుడు ఆధ్యాత్మికత కూడ అధిక తరము కావాలి కదా! అందుకే నా కొంగు గట్టిగా పట్టుకున్న వారదృష్టవంతులు" అని

బాబా అభయమిచ్చారు. ఆయన అంతరంగిక కార్యక్రమ మేదైనప్పటికీ, ఆయన ఆరోగ్యం మాత్రం పూర్తిగా క్షీణించింది. అయినా అప్పుడప్పుడూ మాటల్లో చెప్ప లేని విధంగా ఎంతో ఆరోగ్యంగా కనపడేవారు.

1968 సెప్టెంబరులో యీ ఏకాంతవాస జీవనాని కాయన తుదిపలుకు పలికారు. "నాపని పరిసమాప్తమైంది. అది నూరుశాతం సంతృప్తితో పూర్తయింది. దాని ఫలితం కూడ నూరుశాతమే" నన్నారు. అప్పటికెంత కాలంగానో ఆయన దర్శన భాగ్యం కోసరం ఎంతోమంది పరితపిస్తు న్నారు. వాళ్ళందరి వూరడింపుకా? అన్నట్లు 68 అక్టోబరు 13న, ఒక ప్రకటన చేశారు. తాను 1969 ఏప్రియల్ 10 నుండి, జూన్ 10 వరకు తన ఏకాంతాన్ని విరమించి, తన ప్రేమికులకు దర్శన భాగ్యం కలిగిస్తానన్నది, ఆ ప్రకటన సారాంశం.

దర్శనవార్త విన్న ప్రేమికుల నేకులు, పట్టరాని ఆనందాన్ని పొందారు. అయితే మండలి ప్రముఖులు మాత్రం ఆయన వున్న శారీరక పరిస్థితినిబట్టి దర్శన కాలములో శ్రమకు తట్టుకోలేరేమోనని భయపడ్డారు. ఆయనకు నచ్చచెప్పేందుకు ఎంతగానో ప్రయత్నించారు. 1968 శిశిరమెలాగో గడిచిపోయింది. బాబా ఆరోగ్యం బాగా క్షీణించిపోయింది. అయినా శిష్యులతో అంతా సవ్యంగా జరిగిపోతుందని వుత్సాహపరిచారు. రోజు రోజుకీ ఆయన ఆరోగ్య పరిస్థితి క్షీణించటంతో బొంబాయి పూనాల నుండి ప్రముఖ వైద్యుల్ని పిలిపించి వైద్య పరీక్షలెన్నో చేయించారు. కానీ వారెవరూ ఆయన శరీర లక్షణాలబట్టి

వ్యాధి నిర్ణయం చేయలేకపోయారు.

ఆయన రక్తపరీక్షలో తేలిన దానినిబట్టి పరిశీలిస్తే, మామూలు మనిషెవరైనా అయితే అటువంటి పరిస్థితులలో, కోమాలోనైనా వుంటారు లేకపోతే స్పృహనైనా కోల్పోవాలి. కానీ బాబా ఎంతో వుల్లాసంగా కనపడి, తనను పరీక్షించ వచ్చిన డాక్టర్లను సైతం సరదాగా జోకులు విసురుతూ నవ్వించేవారు.

బాబా 21 మార్చి 1953న, అంతిమ ప్రకటన (Final Declaration) చేశారు. 30 సెప్టెంబరు 1954న దానికి విపులీ కరణ కూడా యిచ్చారు. "ప్రస్తుతం, ప్రపంచంలో వున్న కలవర పరిస్థితి, అశాంతులు, అధికారం, ఐశ్వర్యం కోసరం, పేరాశ, కామంతో మానవ హృదయాల్ని నింపి వేశాయి. ఫలితంగా చెప్పలేనంత దుఃఖం, ద్వేషం, అసూయ నిరాశ భయము, ప్రాప్తిస్తున్నాయి. చైతన్యము యొక్క పరిణామము ఆరంభమైనప్పుడు మాయలో అనేకత్వము వున్నప్పటికీ ఏకత్వమువుండేది. అయితే చైతన్యముబాగాపరిణామంచెందేకొద్దీ అనేకత్వం కూడా అధికమై, రానురాను మరింత పెరిగి, యిప్పటికి దాని పరిమితి మించి పోయే వరకూ వచ్చింది. వుత్తుంగ తరంగం విచ్ఛిన్న మయ్యేటట్లే, యీ అనేకత్వం కూడ దానంతటదే అంతమైపోయి నప్పుడు, యీ మాయా జాలమందు ఏకత్వం ప్రారంభమవుతుంది బాధలు ఎక్కువై అనేకత్వ నాశనానికి కారణ భూతమవుతుంది."

"ఏకత్వం, సౌభ్రాతృత్వాన్ని అనుభవించనీయకుండా వేరు చేస్తున్న యీ అనేకత్వము, యింతకు ముందే నిర్ణయించిన ప్రకారం వినాశమయ్యే సమయ మాసన్నమైంది.

త్వరలోనే జరుగబోవు యీ విలయము ప్రపంచంలోని మూడు వంతుల్ని నాశనము చేయగలదు. నేను మౌన విరమణ చేయుటకు ముందు గానీ, వెంటనేగానీ, ప్రపంచము మూడు వంతులు నాశనము చేయబడును. జరుగవలసినదంతా శీఘ్రముగా జరిగిపోవుటకు త్వరలోనే నేను మాట్లాడుతాను. అవతారునిగా నా వ్యక్తీకరణ కొద్ది కాలమువరకే వుంటుంది. యీ స్వల్ప కాలములోనే నా యొక్క వింత వ్యాధి, అవమానము, నా మౌన విరమణ, నా ఘన వైభవములతో పాటు, నా బలవన్మరణము జరిగి పోవును. నాలోని దివ్యానందంతో, నేను శాశ్వతంగా అందరికొరకు ఎల్లకాలల్లోనూ బాధపడుతూనే వుంటాను. యిది-క్లుప్తంగా బాబా యిచ్చిన అంతిమ ప్రకటనలోని ముఖ్యమైన భాగం.

పై సందేశంలోని భాగానికి ప్రత్యక్ష నిదర్శనంగానే బాబాకు వింత వ్యాధి సోకింది. సుప్రసిద్ధ స్పెషలిష్టులుసైతం ఆ వ్యాధిని గుర్తించలేక పోయారు. వూహించలేని రీతిలో అత్యధిక భాగంగా, రక్తంలో యూరియా కనపడింది. కండరాల యీడ్పులు కుదిపి వేశాయి. 1969 జనవరి అంతంలో ఆయన ఆరోగ్యం బాగా క్షీణించటాన్ని మండలి వారు గుర్తించారు. బాధలు బాగా ఎక్కువైనాయి. రానున్నదర్శన కార్యక్రమాన్ని దృష్టిలో వుంచుకొని, పూనా తీసుకెళ్ళి పెద్దసుపత్రిలో పరీక్షలు చేయించి రోగ నిర్ణయం చేయించి వైద్యం చేయించాలని శిష్యులెంతగానో ప్రయత్నించారు. కానీ బాబా ససేమిరా వద్దని తిరస్కరించారు.

తన పరిస్థితి వైద్యానికి సంబంధించినదికాదని,అదంతా తన ఆధ్యాత్మిక కార్యక్రమాన్ననుసరించి కలిగిన శ్రమకు

ఫలితమని చెప్పారు. జరుగ బోవు తన దర్శనకార్యక్రమాన్ని గురించి, ఏమీ ఆదుర్దా పడవద్దని, యీసారి, అప్పటివరకు జరిగిన దర్శన కార్యక్రమాలకు భిన్నంగా వుండే రీతిలో తాను పడుకొన్న విధంగా దర్శన మిస్తానని, తన దర్శనం పొందగోరే వారికి, ఎప్పుడో, ఎక్కడో, ఎలాగో తానే దర్శన మిస్తానని వివరించారు. అంతే కాకుండా, ఎంతసేపూ అతిప్రాముఖ్యమైనది జరుగ బోతున్నదని సూచించారు. అయితే బాబా చేసిన యీ సూచనల అంతరార్థాన్ని శిష్యులెవరూ అప్పట్లో అవగాహన చేసుకోలేక పోయారు.

1969జనవరి మాసాంతంలో బాబా శరీరాన్ని కండరాల యీడ్పులు బాగా కుదిపి వేశాయి. దాంతో భరింపలేని బాధను బాబా భరించాల్సి వచ్చింది. ఆయన పరిస్థితిని చూచిన శిష్యులు తట్టుకోలేక పోయారు. ఆయన అంతటి బాధ పడటాన్ని మండలివారంతకు ముందెన్నడూ చూడలేదు. రెండు కారు ప్రమాదాల్లో, శరీరాంగాలన్నీ విరిగి కదిలిపోయినప్పుడు కూడ బాబా ఇటువంటి బాధ పడలేదు. మరి యింతటి వ్యధను అనుభవిస్తున్నప్పటికీ, బాబా తనమానసిక చైతన్యాన్ని కోల్పోక, ఎంతో నిబ్బరంగా చలోక్తులు విసిరి హాస్యం చిందిస్తుంటే, మండలివారు ఆశ్చర్య పడేవారు.

1968నవంబరు 19న, ప్రియతమ బాబా, అహ్మద్ నగర్ సెంటరు ప్రేమికులొకర్ని సాంబారు అన్నం వండి పంపమని కబురు పెట్టారట. ఆమె ప్రేమతో వండి పంపే భోజనమంటే, బాబా కెంతో యిష్టం. అయినా ఆనాడామె పంపిన భోజనంలో కేవలం రెండు చెంచాలు మాత్రం తిని "నా కడుపు నిండి పోయింది" అన్నారట. దానిని బట్టి ఆనాటి

నుంచే ఆయన ఆరోగ్యం బాగా క్షీణించటం ప్రారంభించిందని మండలి అనుకున్నారు. మళ్ళీ 19 జనవరి 1969న ఆమెనే సాంబారు అన్నం వండి తెమ్మని కబురంపి, అలాపంపిన భోజనాన్ని కేవలం మధ్యాహ్న భోజనంగానే కాక, రాత్రికి కూడ వుంచుకొని పూర్తిగా తిన్నారట.

రోజు రోజుకీ రక్తహీనత ఎక్కువైంది. శిష్యులంతా 1969లో బాబా ప్రకటించిన దర్శన కార్యక్రమం గురించే ఆలోచిస్తుంటే, బాబా కల్పించుకొని దర్శనమనేదేమంత సమస్య కాబోదని తానుతప్పక దర్శనమిస్తానని వివరించే వారు. మామూలుగా రక్తంలో 14% గ్రాములు వుండ వలసిన హెమోగ్లోబిను 5%కు పడిపోయింది. 20 నుంచి 40 మి.గ్రా. వరకూ వుండవలిసిన యూరియా రక్తంలో 148 మి.గ్రా పెరిగింది. పూనాలోని సుప్రసిద్ధ వైద్యులు డా॥ గ్రాంటుని సంప్రదించి 15 డిశంబరు 1968న ఉదయం 7-30లకు రక్తమార్పిడి మొదటిసారిగా చేశారు. రక్త మార్పిడి చేసిన తరువాత హెమోగ్లోబిను 8% పెరిగి, యూరియా 90 మి. గ్రా తగ్గింది. బాబా బ్లడ్ గ్రూపు AB.

డా॥ గ్రాంటు, బాబాకి ఇ. కె.జి. తీసి, 19 డిశంబరు 1968న మళ్ళీ రెండోసారి రక్తమార్పిడి చేశారు. బొంబాయి నుండి డా॥R గిండేని పిలిపించారు. రక్తహీనత వల్ల కాళ్ళు పాదాలు నీరుపట్టి వాచిపోయాయి కూర్చోలేక పోయారు. రక్తంలో యూరియా మళ్ళీ146%కి పెరిగింది. హెమోగ్లోబిన్ 6.5%కి పడిపోయింది. త్రిచూర్ నుండి డా॥హిర్జి అనే డాక్టరు వచ్చి పరీక్షించారు. ఆయనుండగా యీడ్చుతేపి రాలేదు, పూర్తి చెకప్ కోసరం పూనా తీసుకువెళితే

మంచిదని ఆయన సలహా చెప్పాడు. "నన్నిక్కడ నుంచి కదిలించి పూనా తీసుకువెళితే ప్రాణాలిపుడే వదిలేస్తా" నన్నారుబాబా. దానితో ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నారు.

ఈలోగా 68 డిశెంబరు 22న మెహెరా జన్మదినం వచ్చింది. ఆ మర్నాడు శతృఘ్నకుమార్ కూతురు అమృత్‌కి దారాతో వివాహం బాబా సమక్షంలో జరిగింది. యీ రెండు కార్యక్రమాలను బాబా అంత అనారోగ్యంలో వున్నా స్వయంగా దగ్గరుండి జరిపించారు. తరచు శిష్యులతో "సమయమాసన్నమైంది" అనేవారు. "ఏమీ విచారించకండి. యీ నెలాఖరుకు అంతా సవ్యంగా జరుగుతుంది." అని అన్నాడాయన. సౌంజ్ఞల రూపంలో చెప్పిన మాటలు అప్పట్లో ఏ ఒక్కరూ అవగాహన చేసుకోలేకపోయారు. కండరాల యీడ్పులు, ఎంతగా పీడించినా, ఆయన తన అలవాటు ప్రకారం 1969 జనవరి 12 వరకూ రోజు ఉదయం, సాయంత్రం పురుషమండలి హాలుకు వెళ్ళటం మానలేదు. 12వ తేదీ తర్వాత యిహ తనగది వదలి బయటకు రాలేదు.

బాబా ఆరోగ్యం గురించి విచారించేందుకు మెహెరాబాద్‌లో వుండే పాద్రి అనే శిష్యుడు (యీాయన పూర్తి పేరు ఫరిదూన్ డ్రైవరు) వచ్చి, ఆయనతో సంభాషిస్తూ మాటల సందర్భంలో "బాబామండలి వారంతా వృద్ధులై పోయారు. ఇహ దుకాణం మూసేస్తే బాగుంటుందని" అంటే, "లేదు. అసలు దుకాణం యిప్పుడే తెరవబడుతోంది" అన్నారు. 1969 జనవరి 30 వతేదిన యీడ్పులు చెప్పలేనంతగా పెరిగిపోయాయి. అఖరికి ఆయన వేళ్ళ

కదలిక కూడ కష్టమైపోయింది. సౌంజ్ఞలు గుర్తించే వీలు లేకపోయింది.

పూనా నుండి మళ్ళీ డా॥ గ్రాంటుని పిలిపించారు. తీరా ఆయన వచ్చేసరికి, వూహించలేని విధంగా మళ్ళీ బాబా వుల్లాసంగా కనపడ్డారు. పాపమాయన, బాబా ఆరోగ్యం కుదుటపడిందనుకున్నాడు. నీరసం తగ్గేందుకు బలమైన ఆహారం తినమని సలహా చెప్పగా "మాంసము చేపలు తినమంటారా" అని బాబా అడిగారు. అందుకు డాక్టరు రోజుకు ఒక పూటే మాంసాహారాన్ని తినమన్నాడు. ఆయన సలహాకు బాబా అంగీకరించి" 'సరే' అన్నారు.డా॥గ్రాంటుతిరిగి వెళ్ళబోతుండగా "నా సమయం వచ్చింది." అని సౌంజ్ఞ చేసారు. ఆయన వెళ్ళగానే మళ్ళీ యీడ్పులు మొదలయ్యాయి.

మండలితో సహకరించి సహాయపడేందుకు ఒక వారం రోజులుండేందుకని పాద్రిని మెహెరాజాద్ పిలిపించారు. జనవరి 30 సాయంత్రం పాద్రి వచ్చేసరికి యీడ్పులు బాగా ఎక్కువైనాయి. యీ ప్రతి యీడ్పు నాకు శిలువ వేయుట వంటివని బాబా వివరించారు. ఆనాడు శుక్రవారం, జనవరి31 పొద్దున్నే అలోబా అనే శిష్యుడ్ని పంపి, మండలిగదిలో వున్న హాఫీజు సూక్తులు వ్రాసివున్న బోర్డును తెప్పించారు. అందులో యీ క్రింది మూడు సూక్తులు వ్రాయబడి వున్నాయి.

1. నన్ను అజ్ఞానం నుంచి విముక్తుడ్ని చేసిననాగురువుకు నేను బానిసను. నా గురువేమి చేసినా, అందుకు సంబంధించిన వారందరికది అత్యున్నత లాభాన్ని కలిగిస్తుంది.

2. అదృష్టవంతుడైన జానిసలా, గురునాదేశించిన ప్రతి ఆజ్ఞను, ఎందుకు, ఏమిటన్న ప్రశ్న వేయక పాటించు.

3. నీ గురువు నుండి నీవేమి విన్నా, అది తప్పని ఎన్నడూ అనకు. నా ప్రియతముడా! ఎందుకంటే ఆయనను అర్థం చేసుకోలేని అసమర్థతే నీలోని లోపం.

బాబా శరీర త్యాగం చేసేంత వరకూ యీ బోర్డు యొక్క ప్రాముఖ్యాన్నెవరూ గుర్తించలేదు. ఆయన శరీర త్యాగానంతరం, ఎంతటి అస్తవ్యస్త పరిస్థితి ఏర్పడుతుందో, ఎందరెన్నిరకాలుగా చెప్పుకుంటారో బాబాకు బాగా తెలుసు. అందుకే యీ బోర్డులోని మూడు సూక్తులు అందరి అనుమానాల్ని రాహిత్యం చేసేందుకు దోహద పడ్డాయి. "నేనీ శరీరాన్ని కాదు. విచారించకండి." అని బాబా వివరిస్తే అప్పట్లో ఎవరూ అంతగా వాటిని లక్ష్య పెట్టలేదు.

బాబాకు ఆంతరంగికులుగా పురుషమండలి, స్త్రీ మండలి అని రెండు మండలులున్నవని చెప్పుకున్నాం కదా! యీ రెండు మండలిలలోని సభ్యులు ఒకరికొకరు ఎప్పుడూ వ్యక్తిగతంగా అప్పటి వరకూ చూచుకొని వుండలేదు. అంత అనారోగ్యంలోవుండికూడ, ఒక రోజున, తన స్త్రీ మండలికి పురుష మండలితో పరిచయం చేశారు. వున్నట్లుండి ఒక రోజున యీరుచ్ అనే శిష్యుడు బాబా గది ముందున్న వరండాలో యతిలా అచేతనుడై యోగనిష్టలో వున్నట్లుగా

కూర్చుండిపోయాడు. అతడు బాబా చప్పట్లు కొట్టి పిలిచినా పలక లేదు.

ఎంతకూ చలించకపోయే సరికి మణినిపిలిచి,అతడెందు వల్లో పులకటల్లేదు, వెళ్ళి చూడమన్నారు. దగ్గరకు వెళ్ళి పిలవ మన్నారు. ఆమె వెళ్ళి ఎంత పిలిచినా అతడు మారుమాటాడ లేదు. అప్పుడు బాబా అతని చెవిలో Begin the Begenine అన్నపాట పూర్తిగాపాడి వినిపించమన్నారు.మణిఅలా పాడిన తర్వాత కాసేపటికి, యీరుచ్ నిద్రనుంచిలేచినట్లు లేచాడు. అప్పటి వరకు, ఆ వరండా మెట్లపై నిలబడి వున్న మెహెరాను బాబా తన దగ్గరకు రమ్మని పిలిపించారు. ఆమెనుతన ప్రక్కగా నిలబెట్టుకొని, పురుషమండలి వారందరిని ఒక్కొక్కరుగా రమ్మని పిలిపించి, ప్రతివారికి మెహెరాచేత నమస్కారం చేయించారు. యీ విధంగా ఎంత కాలంగానో బాబా వద్దనే వుంటున్నా, స్త్రీ పురుష మండలి ఒకరికొకరు పరిచయం లేకున్నా, ఆనాడు బాబా స్వయంగా తన అవతార పరి సమాప్తికి కొద్ది ముందుగా వారిమధ్య పరిచయాన్ని స్వయంగా కల్పించారు.

బాబాకుBeignt he Begenine పాటంటే మహాయిష్టం. ఆ పాట ఆమెరికాలో రికార్డు చేయబడింది. దాన్ని రోజు వేయించుకొని వినేవారు. బాబా తాను శరీరత్యాగాన్ని ఎప్పుడు చేసినా ఆ పాట రికార్డు తెచ్చి ఏడుసార్లు వేయమని ఆదేశించారు. 1969 జనవరి 31 మధ్యాహ్నం 12-15 నిముషాలకి మళ్ళీ ఒక పెద్ద యీడ్పు వచ్చింది. ఫలితంగా శ్వాస ఆగిపోయింది. యింతకుముందే ఆయన యిచ్చిన

ఆదేశం మేరకు, బాబాశరీరాన్ని మెహెరాబాదులోని సమాధి వద్దకు తీసుకువెళ్ళి సమాధిలో వుంచి మూయకుండా ఏడు రోజులుపాటు వచ్చేపోయే అశేష ప్రజా సమూహం సందర్శనం కోసరం వుంచారు. ఏడురోజులుంచినా ఆ దివ్యమంగళ రూపం చెడిపోకుండా వెలుగొందింది. లక్షలాదిమంది ఆయన కడసారి దర్శనభాగ్యం పొందిన అనంతరం, 1969 ఫిబ్రవరి 7వ తేదిన సమాధిని మూసివేశారు.

బాబా శరీరాన్ని మెహెరాబాదు కొండమీద సమాధి చేసిన తరువాత, స్త్రీమండలి ముఖ్యులైన మెహెరామాయి, మణీజాయిరానీ తదితరులు యిహ తామంతా మెహెరాబాదులో వుండి చేసేదేముంది? ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోదామనుకున్నారు. అలా గతాన్ని నెమరువేసుకుంటూ, సోదరి మెహెరా, బాబా గదిలో వంటరిగా కూర్చొని, బాబా అవతారతత్వాన్ని, ఆయన హామీ యిచ్చిన రానున్న దర్శన కార్యక్రమాన్ని, హఠాత్తుగా జరిగిన శరీర త్యాగాన్ని ఒక్కొక్కటి అన్వయించుకుంటూ, ఆలోచనలతో కాలం గడుపుతోంది.ఆలోచనలతోవున్న ఆమెదృష్టి గదికిటికీ వెలుపల వున్న చెట్టు మొదలుపై పడింది. ఆమె కంటికామానుపై బాబా ప్రతిరూపం ఎవరో చేతితో చెక్కినట్లు కనపడింది. వెంటనే మణిని, డా॥ గోహెర్‌ను పిలిచి చూపించింది. సమాధిలో వుంచిన బాబా ముఖచిత్రం ఆ మానుపై వారందరికి దర్శనమిచ్చింది.

వారేకాదు, యీ వింత వార్తవిన్న జనం తండోపతండాలుగా వచ్చి యీ చిత్రాన్ని తిలకించారు. అది చాలా ఏళ్ళవరకూ చెక్కు చెదరకుండా అలాగే వుండిపోయినా,

యిటీవల కాలంలో చెట్టు పెరుగుదలతో పాటు, కొంచం, కొంచంగా తరిగిపోతుంది. ఈ విధంగా జరగటంతో బాబా లేనప్పుడు యిక్కడే ముందనుకున్న స్త్రీ మండలికి కనువిప్పు కలిగి, "తాను ఎక్కడికీ వెళ్ళలేదు. యిక్కడే వున్నాన"ని చెప్పినట్లు భావన కలిగింది. తమ సంకల్పం మానుకొని, మెహెరాజాదులోనే స్థిరపడిపోయారు.

ఈ విధంగా మానవసేవలోనే తన జీవితాన్నర్పించిన, అవతారుకు శారీరకంగా, మానసికంగా •ఆధ్యాత్మికంగా కూడా మానవాళి కోసరం పాటుపడి ఎంతటి బాధనో అనుభవించి, శరీరత్యాగం చేశాడాయన. అటువంటి అవతారుని ప్రేమలో మనమంతా పునీతులం కావాలి. ఆయన కోసరమే జీవించాలి. ఆయన కోసరమే మరణించ కలగాలి. మన మరణానంతరంకూడా, చరిత్ర పుటల్లో మానవరూపంలో అవతరించిన భగవంతుడు మెహెర్ బాబా అని మన రక్తాక్షరాలలో వ్రాయబడాలి. ప్రియతముడైన మెహెర్ దేవుని ప్రేమాశీస్సులు యీ కథ చదివిన వారిపైన, విన్నవారిపైన సదావర్షింప చేయుగాక!

జై బాబా !

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | G.VPO1M361 | Date | 10/2/2021 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | C-I, 133. | | |
| Missing Pages | 81 to 88<br>95 to 96 | | |
| Prepared | G. Soundarlri | Scanned | Yameena |
| BOOK SIZE | H 7.4 W 4.9 | Pages | ~~137~~ 131 |